# ONE ACT PLAYS

## (Selection of Four Plays)

| | |
|---|---|
| BISHOP'S CANDLESTICKS | Norman McKinnel |
| THE LAST WAR | Neil Grant |
| LUCREZIA BORGIA'S LITTLE PARTY | A. J. Talbot |



| | |
|---|---|
| JANE WAGON | Florence Howell |



Translated by
**A. VIVECANANDA DEVI**

First Edition 5000 – January, 1959 – **Price Rs. 1-25**

PUBLISHED UNDER THE AUSPICES OF
THE SOUTHERN LANGUAGES BOOK TRUST

Telugu publication rights



Publishers : ADDEPALLY & CO.
SARASWATHI POWER PRESS
RAJAHMUNDRY (A.P.)

# తొ లి ప లు కు

పూర్వం యూరపులో మహోత్సవాల సందర్భంలో ఒక కార్యక్రమం ముగిసి, అనంతర కార్యక్రమం ప్రారంభం అవడానికి పూర్వం ప్రేక్షకులను అలరించడానికి చిన్న చిన్న ప్రహసనాలు, సత్ప్రబోధక సంవాదాలు ఏర్పాటుచేసేవారు. అవే బహుశః నేటి నాటికకు మూలమైయుండవచ్చు. దీన్ని సమగ్ర నాటకానికి తొలిరూపం అనవచ్చు. కాని, పూర్ణనాటకం రూపొందడంతో నాటికకు ఆదరణ తగ్గిపోయింది. అయినా, దీర్ఘ నాటకానికి నాందిగా ప్రదర్శింపబడే ఉపనాటికగా తిరిగి నాటికకు వృత్తినాటకసమాజాల ఆదరణ లభించింది.

ఇటీవల కొంతకాలంగా, ఏకాంకనాటిక ఒక విశిష్టమైన ప్రక్రియగా విశేషంగా గుర్తించబడుతూంది. ఏకాంకనాటికలో సాంఘిక, సాధువర్తన ప్రధానమైన రసబంధురమైన హాస్యసంఘటనలు, చమత్కారచతురభాషణలు, మనస్తత్వచిత్రణ, విచిత్రభావవివరణ, పట్టువిడుపులు రమ్యంగా ప్రదర్శించడానికి ఇది ఉపయోగపడుతున్నది. ఏకాంకనాటిక నాటకంలో ఒక ఖండిక కాదు; నాటక సంక్షిప్తరూపమూ కాదు; విశిష్ట స్వరూప స్వభావాలుగల ఒకానొక రూపక విశేషం.

జె. డబ్లియు. మారియట్ చెప్పినట్లు, "ఒక చిన్న సన్నివేశాన్ని ఎంతటిమహావ సాధన సంపత్తితో, ఎంతదాకా శక్తి పట్టించడానికి వీలున్నదీ, సక్రమంగా రచించి ప్రదర్శించిన ఏకాంక నాటిక రుజువుచేస్తుంది." మనదేశ నాటక సమాజాలు, విశ్వ విద్యాలయ నాటకసంఘాలు నేడు ఏకాంకనాటికలను విశేషంగా ఆదరిస్తున్నవి. రేడియో కార్యక్రమాలలోనూ ఏకాంకిక చాలా ఉపయోగకారిగా ఉంది.

ఈ సంపుటిలోని నాటికల్లో ఎనిమిది విలక్షణమైనవి. ఎ. జె. టాలట్ రచించిన 'సీజరు చెల్లెలు' (Lucrezia Borgia's Little Party) లో కథ విచిత్రంగా, అనేక అఘాత ప్రతిఘాతాలతో సహజసుందరంగా నడుస్తుంది. ఇది ఒక కాలానికి సంబంధించిన అద్భుత ప్రహసనం. విశిష్టమైన హాస్యనాటిక. పీర్ గ్రాంట్

రచించిన "కడసారియుద్ధం" (The Last War) కొత్తపద్ధతిలో రక్తికట్టే చక్కని కట్టుకథ. నార్మన్ మెక్‌నెల్ రచించిన "అయ్యవారి వెండిసెమ్మెలు" (The Bishop's Candlesticks) ఔదార్యాన్ని ప్రతిపాదించే నీతిప్రబోధక నాటిక. ఫ్లారెన్స్ హోవెల్ రచించిన "జేన్ వేగన్" (Jane Wagon) లో మాతృప్రేమ స్త్రీకిమాత్రమే సాధ్యమైన విలక్షణ ధోరణిలో రసవంతంగా అభివర్ణించబడింది.

ఈ గ్రంథంలో సాధ్యమయినంతవరకు పాఠకులకు, ప్రేక్షకులకు కూడా ఏకాంక నాటికలలోని భిన్నభిన్న రీతులను, రసాలను చవిచూపడానికి ప్రసంసనీయమైన ప్రయత్నం జరిగింది.

మద్రాసు,                                        డబ్లియు. వి. వెంకట్రావు

25 – 8 – 1957.

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నికచేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారుచేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు – ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమిచేసినది, వారికి తామెంత ఋణపడిఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లు పడినది ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వ శాస్త్రం, మతం, విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం – ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ముదావహం. నాటక కళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞానవికాసదాయకములైన భిన్నభిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందుముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలోకి అనువదింపచేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువమందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించ

ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలను కూడా వారికి అందజేసి నట్టు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తక సంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు :

మద్రాసు,
7 – 10 – 1958.

ఎ. లక్ష్మణస్వామిముదలియార్,
వైస్‌ఛాన్సెలర్, మద్రాసు విశ్వవిద్యాలయం.

# నాటికలు

# అయ్యవారి వెండి సెమ్మేలు

## పాత్రలు

| | | |
|---|---|---|
| బిషప్ | .... | (మతగురువు) |
| హంతకుడు | | |
| మేరీ | .... | (పనిపిల్ల) |
| పెరసోమ్ | .... | (బిషప్ చెల్లెలు) |
| పోలీసోద్యోగి | | |

## మొదటి రంగం

కాలం — క్రిందటి శతాబ్దపు చివరిరోజులు.

స్థలం — ఫ్రాన్సుదేశంలోవున్న పారిస్ నగరానికి సుమారు ముప్పైమైళ్లదూరంలో ఒకవూరు.

[బిషప్ వంటిల్లు. సామాన్యంగా కొద్దివంటసామానుతో వుంటుంది. కుడివైపూ, ఎడంవైపూ గుమ్మాలువుంటాయి. కుడివైపు గుమ్మానికీ ఎడంవైపు గుమ్మానికీ పక్కగా కిటికీలుంటాయి. గదిమధ్యగా గోడకు చలిమంట కాగడానికి చిన్నఅగలా కట్టబడి వుంటుంది. చలిమంట అరమీద సామాను అందంగా పెట్టుకోడానికి వీలుంటుంది. ఎడంవైపు గుమ్మంపక్క చిన్నబల్ల కూచోడానికి వేసివుంటుంది. కుడివైపు కిటికీ దగ్గిరిగా రాతబల్లవుంటుంది. బల్లమీద కర్రతో చేసిన శిలువా, కలం, సిరాబుడ్డీ, కాగితాలూ వగైరావుంటాయి. కుడిపక్క గోడమీద గోడగడియారం తగిలించివుంటుంది. ఎడంపక్క భోజనసామగ్రి పెట్టుకునే బల్ల (కబోర్డు) వుంటుంది. దానికి సమీపంలోనే భోజనాలబల్లా దాని చుట్టూ కుర్చీలూ వుంటాయి. అది చలికాలం, చలిమంట మండుతూ వుంటుంది. చలిపొయ్యి అరబల్లపైన రెండు అందమైన వెండిదీపపు సెమ్మేలు

వుంటాయి. సామాన్య సంసార పరిస్థితిని తెలుపుతున్న వాతావరణంలో ఈ రెండు దీపపు సెమ్మెలు కొంచెం వింతగా కనబడతాయి.

తెర లేచేసరికి మేరీ, పెరసోమ్ స్టేజిమీద కనబడతారు. పొయ్యి మీదవున్న పులుసుని మేరీ గరిటెతో కలుపుతూ వుంటుంది. పెరసోమ్ భోజనాలబల్లమీద బట్ట సర్దుతూవుంటుంది.]

పెర — మేరీ! సూప్ మరుగుతూందా?

మేరీ — ఇంకా లేదండమ్మగారూ!

పెర — ఈపాటికి మరుగుతూవుండాలి. పొయ్యి బాగామంటపెట్టలేవేపిల్లానువ్వు

మేరీ — మీరేగదమ్మా, పొయ్యి అంటించింది.

పెర — అల్లా మాటకిమాట సమాధానం చెప్పకు. ఇది మర్యాదకాదు. తెలిసిందా?

మేరీ — అలాగేనండమ్మగారూ!

పెర — ప్రతీదీ మళ్లీమళ్లీ చెప్పించుకోక.

మేరీ — సరేనండమ్మగారూ!

పెర — అన్నయ్య ఎక్కడికి వెళ్లాడో, ఏమిటో! (గడియారంవంక చూస్తూ) అప్పుడే పదకొండుఅయింది. ఇంత పొద్దుపోయినా యిల్లుపట్టలేదు.

మేరీ — చాలా పొద్దుపోయిందండి అమ్మగారూ!

పెర — వెళ్లేప్పుడు బిషప్‌గారు ఏదైనా కబురు నాకు చెప్పమని చెప్పారా?

మేరీ — లేదండమ్మా!

పెర — పోనీ, ఎక్కడికి వెళుతున్నారో చెప్పారా?

మేరీ — చెప్పారండమ్మగారూ!

పెర — (వెక్కిరిస్తూ) 'చెప్పారండమ్మగారూ!' ఏడవకపోయావా. ఇందాకటి నుంచి అడుగుతుంటే ఈమాటెందుకు చెప్పలేదు?

మేరీ — మీరడగలేదని చెప్పలేదండి, అమ్మగారూ.

పెర — నిజంగా నేనడగలేదని చెప్పలేదుకదూ నువ్వు, అవునా?

మేరీ — 'అతిగా వాక్కు' అని పొద్దుటేకదండీ మీరుచెప్పింది. అందుకని అనుకున్నాను........

పెర — అయ్యోరాతా! ఏమనుకున్నావే? ఇక నీతోనేను పనిచేయించుకోలేను.... ఊహూ....లాభంలేదు.

మేరీ — సరేనండి.

పెర — ప్రతీదానికీ అవునండీ, సరేనండీ అని చిలకలా పలక్క. అన్నిటికీ ఒకటే బుర్రవూపడమేనా నీపని ?

మేరీ — లేదండి, అమ్మగారూ !

పెర — అయ్యగారెక్కడికి వెళుతున్నానని చెప్పారే, యింతకీ ?

మేరీ — మా అమ్మని చూడ్డానికి వెళ్లారండీ.

పెర — మీ అమ్మదగ్గిరికా ? ఎందుకూ ?

మేరీ — 'మీ అమ్మకెలావుందని' అయ్యగా రడిగారండీ. చాలా బాధపడుతుం దని చెప్పానండమ్మగారూ.

పెర — అడిగాడో లేదో మీఅమ్మ అవస్థ వర్ణించి చెప్పేసేవు. అయినా, నీదేం పోయిందిలే. తిండీ తిప్పలూ, నిదరా నిప్పలూ లేకుండా నువ్వు చెప్ప గానే ఆయన పరిగెత్తాడు. నీకు కొంచెంకూడా విశ్వాసం లేదు పిల్లా!

మేరీ — సూప్ మరిగిపోతుందమ్మగారూ.

పెర — మొద్దుముఖం ! పూరికేవాక్క. దాన్నిదింపి, చల్లార్చు. (మేరీ చెప్పి నట్టుగా చెయ్యబోతుంది.) ఆగు....నిన్నే ! ఆగవే; అల్లాకాదు. నేనే వస్తు న్నాను. దాన్ని అలా వుంచు. నువ్వువెళ్లి భోజనాల బల్లమీద ఆ వెండివుప్పు గిన్నెలూ, అవీ సర్దు.

మేరీ — వెండిగిన్నెలాఅండీ, అమ్మగారూ ?

పెర — అవును, వెండిగిన్నెలే ! నీమందమతికితోడు చెముడుకూడా మొలి చిందా ఏం !

మేరీ — వాటిని అమ్మేశారండీ !

పెర — (భయంతో) అమ్మేశారా? అమ్మేయడమే? నీకేమైనా మతిపోయిందేమిటే! ఎవరమ్మారు? ఎందుకమ్మారు?

మేరీ — మీరు మధ్యాహ్నం బయటికి వెళ్లారు. అప్పుడు అయ్యగారు నన్ను పిలిచి " 'జెర్వే'కి నా వెండిగిన్నెలమీద చాలా మోజుగా వుంది. వాటిని తీసుకువెళ్లి అతనికి ఖరీదుకిచ్చిరా" అన్నారు. వారు చెప్పిన ప్రకారం చేశా నమ్మగారూ.

పెర — నాతో సంప్రదించకుండా వాటిని అమ్మడానికి నీకెవరు పెత్తనమిచ్చారే?

మేరీ — (భయపడుతూ) అయ్యగారే పురమాయిస్తే అమ్మగారూ?

పెర — ఏమిటీ? అయ్యగారే చెప్పారంటున్నావా? డబ్బుతో అయ్యగారికేం పనే?

మేరీ – ఈతప్పు కాచండమ్మగారూ. ఆ డబ్బు బహుశా మేరీగ్రింగో కోసం ఖర్చయి వుంటుందనుకుంటాను అమ్మగారూ.

పెర – ఆముసలినక్క 'మేరీగ్రింగో' అక్కడ గుట్టమీద కాపరం వుంటుంది కదూ! యిది దానికోసమా? పనిచేయడానికి వొళ్లు వంగక రోగమనివంక పెట్టే దొంగముండ అది. దాని కెందు కింతడబ్బు?

మేరీ – 'ఇవ్వాళ ఇంటిఅద్దె కట్టకపోతే ఇంట్లోంచి బయటికి వెళ్లగొడతాన'ని అమీనాగారు అన్నారట. 'ఎల్లాగన్నా రక్షించాలి మీర'ని అయ్యగారి దగ్గరకి జాన్ అనే బుడ్డోడిచేత కబురుపంపింది.

పెర – అయ్యో దేముడా....... లాభం లేదు....యిక ఏమనుకున్నా లాభంలేదు. ఇక యింట్లో చిల్లిగవ్వకూడా మిగల్దు. జమీ అంతా తెగనమ్మాడు. నగదు మాయమై పోయింది. ఇంట్లోవున్న సామానుకూడా వొకటివొకటీ అయి పోయింది. ఏమీమిగల్లా కొంపలో! నాదేదో అకొంచెంఆస్తీ వుండబట్టి యిన్నిమెతుకులు దొరుకుతున్నాయి. లేకపోతే ఆకలితో మాడిచావాల్సిందే! ఎంతోచక్కని వెండిగిన్నెలు. (వెక్కి వెక్కి ఏడుస్తూ) అయ్యో! ఎంత ముదుగా వుండేవే- ఇకనేను భరించలేను. నావల్లకా దింక యీ సంసారం యీదడం. (గొల్లున ఏడుస్తుంది.)

మేరీ – తప్పైపోయిందండీ. తెలియక చేశానమ్మగారూ. మీరింత విచారిస్తా రని తెలిస్తే....

పెర – నీకెందుకే మధ్యవిచారం? బిషప్ తనకిష్టమై తనవెండిగిన్నెలు తను అమ్ముకున్నాడు.... అమ్ముకోనియ్యి.... నీమురికి చేతులతో నాదగ్గిరికి రాక....వెళ్లు. వెళ్లి బాగా కడుక్కో.

మేరీ – అలాగేనండి అమ్మగారూ (కుడివేపు వెళ్లిపోతుంది. బిషప్ ప్రవే సిస్తాడు)

బిషప్ – యిక్కడ ఎంత వెచ్చగావుంది. మంచులావున్న బయటి చలిగాలి అనుభవిస్తేనేగాని యీ వెచ్చదనం హాయి తెలియదనుకుంటాను. (పెర సోమ్ వచ్చి అన్నగారి చలికోటు తీయడానికి సాయం చేస్తుంది. మేరీ వంగి నమస్కారం చేస్తుంది. బిషప్ పెరసోమ్ వంకచూసి) ఏమైందమ్మా, ఏడుస్తున్నావేం? మేరీ చెప్పినమాట వినకుండా ఏమైనా పెంకితనం చేసిందా? (మేరీని చూపుడువేలితో బెదిరిస్తూ) ఏం జరిగింది చెల్లెమ్మా?

పెర – మేరీ ఏమీచెయ్యలేదు.... కాని.... కాని....

బిషప్ — అలాఅయితే మంచిదే! విషయం నెమ్మదిమీద చెపుదువుగాని లే, అమ్మా. మేరీ, మీఅమ్మకి కొంచెం సుళువుగావుంది. ఇప్పుడే వైద్యుడు వచ్చి వెళ్లాడు. ఇంటికి వెళ్లు. (మేరీ వెళ్ళిపోడానికి బట్టలేసుకుంటుంది.) మేరీ, నిశ్శబ్దంగా వెళ్లమ్మా. మీఅమ్మ యిప్పుడే పడుకుంది. ఇంతవరకనూ మేమిద్దరం దైవప్రార్థనలు చేశాం. వెళ్లిరా, మేరీ.

మేరీ — మీరుఋణం తీర్చుకోలేనయ్యగారూ. (బయటికి వెళ్లడానికి తలుపు తీస్తుంది. రివ్వున బయటి చలిగాలి లోపల ప్రవేశిస్తుంది.)

బిషప్ — మేరీ!.... బయట చాలాచలిగావుంది. ఇదిగో నాకోటు వేసుకువెళ్లు వెచ్చగా వుంటుంది.

మేరీ — (బిడియపడుతూ) వద్దండి అయ్యగారూ!

పెర — అది పడుచుది. దానికి చలేమిటన్నయ్యా.

బిషప్ —బయటికి వెళ్లి నువ్వుచూళ్లేదు అమ్మాయి; బయటచలి ఎంతఘోరంగా వుందో. మేరీ, యిలావచ్చి కోటుతొడుక్కో (మేరీ భుజాలమీద కోటు వేస్తాడు) ఇక యింటికి పరుగెత్తమ్మాయీ!

పెర — అన్నయ్యా! నాకిక వోపికలేదు. అదిగో అక్కడ సూప్‌పెట్టాను. కూర్చుని తాగు. అది బల్లమీదపెట్టి చాలాసేపయింది. చల్లారిపో యుంటుంది. రుచికూడాపోయి వుంటుంది. ఆలస్యంగా రావడం తప్పు నీది.

బిషప్ — (తాగుతూ) చాలా రుచిగావుందమ్మా.

పెర — మేరీతల్లికి నువ్వక్కడ యింత రాత్రిపడేవరకూ వుండేటంత జబ్బుగా వుందా చెప్పు. నిన్ను రప్పించుకోడానికి వాళ్లు ఎన్నిఎత్తులైనా వేస్తారు. వాళ్ల కష్టసుఖాలు వాళ్లవేగాని వాళ్ల బిషప్ కష్టసుఖాలు వాళ్లకక్కరలేదు.

బిష — నన్ను రమ్మనికోరడం నామీద వాళ్లకుండే విశ్వాసంచేతనేగదమ్మా.

పెర — నువ్వు నన్నేమైనా అను. తనకుమాలినధర్మం మాత్రం పనికిరాదు.

బిష — సూపు చాలారుచిగావుంది చెల్లెమ్మా. నేనంటే నీకు తగనిదయే అమ్మాయీ!

పెర — నువ్వుకాక నాకింకెవరువున్నారుచెప్పు అన్నయ్యా. నేనుకూడా లేక పోతే నువ్వీపాటి కేమై పోయివుందువో! కనబడ్డ ప్రతీదొంగవెధవా మోసం చేసేవాడు. చూసిన ప్రతీ ముసలినక్క వల్లో చిక్కుకునేవాడివి.

బిష – అమ్మాయీ, అల్లాఅనకమ్మా! అనాలనివుంటే నన్నుఅను. నిర్భాగ్యులు వాళ్లు, వాళ్లనేమీ అనకమ్మా.

పెర – అన్నయ్యా! నీవ్యవహారం నాకేమీ బాగాలేదు. నువ్విలా సమస్తం దానం చేయడం మొదలుపెడితే మనకి చిల్లిగవ్వకూడా యిక మిగలదు. తరవాత నీయిష్టం. నాకుమాత్ర మిదేమీ నచ్చుటంలేదు.

బిష – లోకమంతా బాధతో దుఃఖంతో నిండివుందమ్మా! మనం చేయగలి గిందీ చేసేదీ ఒకలెక్కలోది కాదు.

పెర – అవునవును. లోకంలోని బాధవొక్కటే నీకర్థమైంది. నిన్ను ప్రేమించే వాళ్లు నీకోసం పడేబాధా తాపత్రయం మాత్రం నీకర్థంకావు.... నేనుపడే యాతన....

బిష – (లేచి) ఏమిటమ్మా నువ్వనేది ? నిన్ను బాధపెడుతున్నానా ? ఏడు స్తున్నావా, పిచ్చిధానా! నీమనసు నొప్పించాలని కలలోకూడా అనుకో లేదమ్మా. చెల్లీ తప్పుక్షమించు.

పెర – క్షమించమన కేమంటావు? క్షమించమనగానే చేసిననేరం పోదు. సరే. ఎందుకీసొదంతా....ఇంతకీ యిది నారాత.... అసూప్ కాస్తా చల్లారి పోతుంది. త్వరగా తాగు.

బిష – (కూర్చుని) నీ యిష్టం....అసలువిషయం చెప్పావుకాదు, చెల్లీ.

పెర – పసిపిల్లాడికన్నా అన్యాయం నువ్వు. బయటికి అడుగుపెట్టానో లేదో మేరీని పిలిచి ఆ వెండిగిన్నెలు కాస్తా అమ్మించేశావు. నిన్ను క్షణంవదిలి వెళ్లడానికి వీల్లేకుండావుంది.

బిష – ఆ....అవును....ఆ వెండిగిన్నెలంటే నీకు ప్రాణం అని తెలుసు.... కాని అమ్మక తప్పలేదు చెల్లీ.

పెర – అవంటే నాకు ప్రాణమని నెమ్మదిగా అంటున్నావా? అవి మనకి వంశపారంపర్యంగా తరతరాలనుంచీ వస్తున్నాయి.

బిష – అవును.... అమాట నిజమే! కాని ఏంచేయను చెప్పు. నిజం నువ్వే ఆలోచించు. వుప్పు వెండిగిన్నెలో వేసినా, పింగాణీ గిన్నెల్లో వేసినా వుప్పు వుప్పే గదమ్మా!

పెర – అవునవును. రేపు నేలమీద వడ్డించిన భోజనమయినా సరిపోతుందం టావు. త్వరలోనే ఆరోజూ వస్తుంది. ఆ ముసలిముండ మేరీగ్రింగ్రోకి మళ్ళీ యిక్కడికి మనిషినిపంపే ధైర్యం ఎలావొచ్చిందీ అంటా! కింపటిసారి

నాకళ్లపడ్డప్పుడు కచ్చితంగా చెప్పాను నీజోలికి రావద్దని. బుద్ధి వస్తుందనుకున్నాను. కాని లాభం లేకపోయింది.

బిష — "మాయింటికివచ్చి రెండురోజులుండు" అన్నాను. నీకిష్టముండదని రానన్నది.

పెర — నాకు కష్టమని రాలేనన్నమాట!

బిష — అమీనా చాలాపెద్దమనిషి. ఇన్నాళ్లూ అద్దెకోసం ఆగాడు. యింకెన్నాళ్లని ఆగుతాడు చెప్పు, నువ్వే? అందుకని అద్దె నేను కట్టకతప్పలే దమ్మాయీ.

పెర — (వెటకారం, విచారం కలిసిపోగా)అవునవును! అద్దె నువ్వుకట్టక తప్పదు మరి.

బిష — అద్దె కట్టడానికి దగ్గిర సొమ్ము లేకపోయింది. మన అదృష్టం బాగుండి ఆవెండిగిన్నెలు మిగిలాయి. (చిరునవ్వుతో) వాటిని అమ్మక తప్పలేదు. కాని నీకు చాలాబాధ కలిగించినందుకు మాత్రం విచారంగా వుంది.

పెర — సరే! నీకిష్టమెలావుంటే అలాగే కానియ్యి. నీ కష్టంచెప్పే దెవరూలేరు. ఇక మిగిలినవి వెండిసెమ్మెలెగా! అవీ అయిపోతాయి కొన్నాళ్లకి.

బిష — (బాధతో) అమ్మాయి, అలా అనకు. అవి మాత్రం అమ్మను.

పెర — ఏం! ఎందుకమ్మ కూడదూ? అవీ ఎవరోవొకరి రుణం తీర్చడానికి పనికి వస్తాయిగదూ?

బిష — నువ్వు చెప్పింది వాస్తవం కావచ్చు. కాని వాటిని అమ్మదలుచుకో లేదు. నువ్వు పుట్టగానే అమ్మ కళ్లుమూసింది. కళ్లుమూస్తూ మూస్తూ తన జ్ఞాపకార్థంగా ఈసెమ్మెలు యిచ్చింది. బాగా ఆలోచించి చూస్తే వాటిని యింతయిదిగా ప్రేమించడంకూడా తప్పేమో ననిపిస్తుంది మనసులో.

పెర — అన్నయ్యా (ఏడుపుకంఠంతో) నీకు పుణ్యముంటుంది. యింక ఆ విషయం ఎత్తకు. నాగుండె బద్దలైపోతుంది. నాతప్పులు క్షమించు అన్నయ్యా. నన్ను ఆశీర్వదించు. నేను యిక వెళ్లిపడుకుంటాను.

[బిషప్ సిలువగుర్తు గుండెలమీద వేసుకుని చెల్లెల్ని దీవిస్తాడు.]

పెర — మరి రాత్రివాళా చదవి. కళ్లు పాడుచేసుకోకు అన్నయ్యా!

బిష — అలాగే, నువ్వు చెప్పినట్లే చేస్తానమ్మాయి. నువ్వువెళ్లు. వెళ్లిపడుకో. (వెళ్లిపోతుంది. బల్లదగ్గిరికివచ్చి బల్లమీద పుస్తకంతీస్తూ వెండిసెమ్మెల వంకేచూస్తూ) 'ఎవరి అద్దెకోసమైనా పనికివస్తా'యని కదూ అమ్మాయి అంది. ఎంత చక్కనిపూహ తట్టింది!

[లేచి మంటలో బొగ్గులు వేసి, దీపంకోడి సరిచేస్తాడు. తరువాత బల్లమీదవున్న పుస్తకాలూ కాగితాలూ సర్దుతాడు..ఏదో అశాంతి ఆవరిస్తుంది. చలితో వణుకుతూంటాడు. బయట గడియారం రాత్రి 12 గంటలు కొట్టింది. చదవాలనికూచుంటాడు. నెమ్మదిగా నేపథ్య సంగీతం వినబడుతూంటుంది. అప్పుడే జైలునుంచి బయటికివచ్చిన హంతకుడొకడు కత్తితో ప్రవేశిస్తాడు. బిషప్ వెనకాలే వచ్చి గట్టిగా పట్టుకుంటాడు.]

హంత – గట్టిగా అరిచావా ప్రాణాలు దక్కవు!

బిష – కూచుని చదువుకుంటున్నాను, చూస్తున్నావుకదయ్యా! నీకింతకీ యేం సాయంకావాలి తమ్ముడూ!

హంత – (కరకుగా) మూడురోజులనుంచీ వుపవాసం. తినడానికి తిండి దొరక లేదు. ముందు కడుపునిండా తిండికావాలి. త్వరగా పెట్టు ....ఊ ....త్వరగా కావాలి. లేకపోతే ....

బిష – (త్వరగా) అలాగే పెడతాను నాయనా! అమ్మాయి నడిగి బీరువాతాళాలు తెస్తాను. ఒక్క క్షణం ఓపికపట్టు (లేస్తాడు.)

హంత – కూర్చో (నవ్వుతూ కూర్చుంటాడు బిషప్) ఈవేషాలేం నాదగ్గరపనికి రావు. కల్లబొల్లికబుర్లకు మోసపోయేవాడినికాదు నేను. చెల్లెల్ని తాళాలడిగి తెస్తానంటున్నావు కదూ. బలే! మంచికథే అల్లావు. ఇంట్లో అందర్నీ లేపడా నికా ఈఎత్తు? అవునా.... ఏం భలేతమాషా .... నిజంగాచెప్పు భోజనముందో లేదో-నాకు తాళాలతో నిమిత్తం లేదు. నా పేగులు ఆకలితో నకనకలాడి పోతున్నాయి. ముందు భోజన మెక్కడుందోచెప్పు.

బిషప్–(తనలో) పెరసోమ్ తాళాలువేయకపోతే యెంత బాగుండును! (పైకి) నేనూచెల్లాయీతప్ప యింట్లో యింకెవరూలేరు.నామాటనమ్ము తమ్ముడూ!

హంత – ఎవరూలేరని నాకేం నమ్మకం!

బిష – నేను నిజం చెపుతున్నాను. అంతే!

(హంతకుడు బిషప్ వైపు తదేకధ్యానంతో చూస్తాడు)

హంత – సరే, నమ్మకతప్పదు, (బిషప్ కుడివాకిలివైపు వెళ్ళుతుంటాడు.) ఇలాచూడు నమ్మించి మోసంచేశావో నీచావు మూడిందే! అందువల్ల నాకు పోయేదేమీలేదు.

బిష – పోయేది ఏమీలేకపోవడమేమిటి, నాయనా నీ ఆత్మ పాడైపోతుంది.

నా ప్రాణానికన్నా నీ ఆత్మ యెక్కువది (పెర్‌సోమ్! పెర్‌సోమ్!)

(హంతకుడు కత్తిపట్టుకుని వెనక సిద్ధంగా నుంచునివుంటాడు.)

పెర – (లోపలనుంచి) ఏం అన్నయ్యా ?

బిష– చూడమ్మా! యెవరో బాటసారి అకలితో నకనకలాడుతూ వచ్చాడు. నీ వింకా నిదరపోకుండావుంటే వక్కసారివచ్చి వడ్డించి పో అమ్మా. నువ్వువచ్చి బీరువాతాళాలు తీసిపోతే నేనైనా వడ్డిస్తాను.

పెర– (లోపల) ఇంత అర్ధరాత్రివేళ భోజనమేమిటి? ఇదంతా చాలాబాగుంది. దారినిపొయ్యే ప్రతివానయ్యా వచ్చి రాత్రి తెల్లవార్లూ నిద్దరలేకుండా చెయ దల్చుకున్నాడా యేం?

బిష– చాలా అకలిగా వున్నాడమ్మా!

పెర– సరే, వస్తున్నాను. (వస్తుంది. హంతకుడి చేతిలో కత్తిచూసి హడలి పోతుంది) అన్నయ్యా, కత్తితో వాడేంచేస్తున్నాడు?

బిష– కత్తా? బహుశా నాదగ్గిర కత్తిఅమ్మేశాననుకున్నాడేమో * (నెమ్మదిగా నవ్వుతాడు.)

పెర– అన్నయ్యా, నాకేదో భయంగావుంది. క్రూరమృగంలా మనవంకఅలా చూస్తున్నాడేమిటి ?

హంత– త్వరగా పెట్టు. ముందు భోజనంపెట్టకపోతే మిమ్మల్నిద్దరినీ ముందు చంపి మరీభోజనం పెట్టుకు తింటాను.

బిష– తాళాలు యిలా నాకియ్యి, పెరసోమ్! (యిస్తుంది.) యిక వెళ్లిపడుకో అమ్మా! (వెళుతూంటే హంతకుడు అవిడముందుకు వచ్చి)

హంత– అగు! నాపని అయ్యేవరకూ మీరిద్దరూ యీ గదివదలి అవతలకి వెళ్లడానికి వీల్లేదు. (బిషప్‌వంక చూస్తుంది.)

బిష– ఈ పెద్దమనిషికి భోంచేసేప్పుడు సాయం కావాలటమ్మా. నువ్వు కొంచెంసేపు అగు పెరసోమ్.

పెర– సరే అన్నయ్యా! (ఇద్దరివంకా చూస్తూ బల్లదగ్గిర కూచుంటుంది,)

బిష– ఇదిగో రొట్టె. అది కూర. బ్రాందీ కొద్దిగా వుంది. పుచ్చుకో నాయనా.

హంత– అన్నం బల్లమీదపెట్టి,వచ్చి నాకెదురుగా నిలబడు (బిషప్‌అలాగే నిలబడి డ్రాయరుసొరుగుతీసి కత్తీ, ఫోర్కూ తీసి హంతకుడికిస్తూ అతని చేతిలో కత్తివంకే చూస్తాడు.)

---

* భోజనానికి వాడేకత్తి

హంత— నాకత్తి మంచిపదునుగా వుంది. (చెయ్యి కత్తివారమీదపెట్టి వాళ్లవం కేచూస్తాడు.) ఫోర్కు అంటారా దాన్ని. అది పట్టి వుక్కుముక్క(ఫోర్కుని దూరంగా విసురుతాడు.) అక్కడ జైల్లో మాకు ఫోర్కులంటూ ఉండవు.

పెర— జైల్లోనా ?

హంత— (చేత్తో పెద్ద రొట్టెముక్కని విరుచుకుని తినడం మొదలు పెడతాడు ఏమిటది? కిటికీ లెందుకు మూసేయకుండా వదిలేశావు ? ఎవరైనాసరే లోపల ప్రవేశించవచ్చునా నీ వుద్దేశ్యం? (లేచి కిటికీలు మూస్తాడు.)

బిష— అవును నాయనా! అందుకే తెరిచి వుంచాను.

హంత— కాని నేను వాటిని మూసేశాను.

బిష— ఈముప్పైఏళ్లలో వాటిని మూయడ మిదే మొదటిసారి.(నిట్టూరుస్తాడు.)

(హంతకుడు ఆత్రంగాతింటూ వొక ముదుసు నేలమీద విసురుతాడు.)

పెర— అయ్యో! పండంటి దాన్ని నేలమీద విసిరావా?

(బిషప్ ముదుసుతీసి బల్లమీద పెడతాడు.)

హంత— నీకు దొంగలంటే భయంలేదా?

బిష— భయమెందుకు నాయనా! వాళ్లూ మనలాటి వాళ్ళే. వాళ్లస్థితి చూస్తే నాకు జాలివేస్తుంది.

హం— హ....హ....హ....హ....హా. వాళ్లంటే జాలా? (బ్రాందీతాగుతూ) భలే మంచిమాటే....హ....హ....హ....హ.హా....వాళ్లంటే నీకు దయగదూ ? (తాగుతూ. గబుక్కున) ఇంతకీ నీ వుద్యోగం?

బిష— బిషప్‌ని.

హంత— హహ....హా..బిషప్ వా....అయ్యో దేముడా! నేను చచ్చానన్నమాటే. నువ్వు బిషప్‌వికదూ?

బిష— నీకేం ఫరవాలేదు నాయనా. చెల్లీ, నువ్వు వెళ్లమ్మా. అతనేమీ అను కోడు. నువ్వువెళ్లిపో.

పెర— నిన్నిక్కడ వదిలేశా?

బిష— అవునమ్మా! నువ్వువెళితే మేం సరదాగా. కబుర్లు చెప్పుకుంటాం!

(ఆకలిమీద బ్రాందితాగడం మూలంగా వెంటనే కైపెక్కు తుంది.)

హం— ఏమిటిది? వెళ్లు. వెళ్లి మమ్మల్నివదిలేయి. నాకు బిషప్‌తో మాట్లాడాలని వుంది....హ....హ....హా....బిషప్‌తో కబుర్లు (మళ్లీ తాగుతూ నవ్వుతాడు నవ్వుమీద వగ్గు వస్తుంది.)

బిష— పోయి పడుకోమ్మా! (తలుపు తీస్తాడు. ఆమెకుడివైపు తలుపులోంచి వెళ్లిపోతూ హంతకుణ్ణి సమీపించగానే గౌను దగ్గిరిగా తీసుకుంటుంది.)

హం— (తనలో తను నవ్వుకుంటూ) మతగురువు! హ....హ....హా....మంచిది. నేను....(గట్టిగా) నే నెవర్నో నీకు తెలుసా?

బిష— చాలా కష్టజీవివనిమాత్రం తెలుసు, నాయనా!

హంత— (ఆశ్చర్యంగా) కష్టజీవీ....కష్టజీవా....? అయ్యో దేముడా....నిజం గానే నేను....కష్టజీవిని (తాగుతూ) కాని అది చాలాకాలం కిందటిమాట హ....హా నేను మనిషిగా వున్నప్పటి కబురది....కాని నేనిప్పుడు మనిషిని కాదు....ఇప్పుడు కేవలం 15729 నెంబర్ను మాత్రమే. పదేళ్లు నరకం లోవుండి వచ్చాను.

బిష— నాయనా! నీ నరకజీవితాన్ని గురించి అంతాచెప్పు .... మనసువిప్పి మాట్లాడు నాయనా! మరేం ఫరవాలేదు.

హంత— ఎందుకు? (అనుమానంగా) నా వెంట పోలీసువాళ్లు పడాలనా నాకథ అంతా చెప్పమంటున్నావు.

బిష— నేను పోలీసుల కేమీ చెప్పను. నా మాటనమ్ము.

హంత— (బిషప్‌వంక తదేకదీక్షగాచూసి.) సరే నమ్ముతున్నాను. (బుర్రగో క్కుని) వెర్రివెధవని ఎందుకు నమ్ముతున్నానో నాకే తెలియదు.

బిష— (దొంగ రెండుభుజాలమీదా చేతులువేసి.) చూడు బాబూ....నువ్వు అనరకంలోకి వెళ్ళకముం దేం జరిగిందో చెప్పు...పోనీ....

హంత— చాలాకాలం కిందటి మాటది. అంతా మరిచిపోయాను.....జ్ఞాపకం చేసుకోనియ్యి....అ....అవును....నాకొక చిన్నఇల్లు వుండేది. దానిచుట్టూ ద్రాక్షతీగలు అల్లుకున్నాయి. (ఏదో కలలోలా) సాయంకాలపు నీరెండ ఆద్రాక్షతీగలమీద పడితే పచ్చగా గరుడపచ్చలు అరబోసినట్లు మిలమిలా మెరుస్తూ వుండేది. అ చిన్నఇంట్లో వొకస్త్రీ వుండేది. (ఆలోచిస్తూ) ఊ. నాభార్య కావచ్చునామె....అవును....(త్వరత్వరగా చెపుతూ) అవును నా భార్యే....బాగాగుర్తుకు వచ్చింది. దానికి చాలా జబ్బుచేసింది. తినడాని కింట్లో గుప్పెడు మెతుకులు లేవు. నాకప్పుడు పనేదీదొరకలేదు. అ నంవ

త్సరమంతా మాకు గడ్డురోజులు. నా జానెట్....నాభార్య జబ్బుతో చావడానికి సిద్ధంగావుంది (కొంచెం ఆగి) దాన్ని ఎలాఅయినా తిండిపెట్టి బతికించాలని దొంగతనం చేశాను. (ఆగుతాడు. బిషప్ దొంగభుజాలమీద నిమురుతాడు.) వాళ్ళు నన్ను పట్టుకున్నారు. దొంగతనం ఎందుకు చేయాల్సి వచ్చిందో చెప్పాను. బతిమాలాను. కాని వాళ్ళు నామాట వినకపోగా హేళన చేశారు. నవ్వారు.... 'పదేళ్ళు ఓడజైలు నీకు' అని ఆనరకానికిపంపారు నన్ను.(ఆగి)నేను ఓడజైలుకు వెళ్ళిన రోజునే జైలరుచెప్పాడు నాజానెట్ చనిపోయిందని. (కోపంతో పళ్ళుకొరుకుతాడు.) వాళ్ళందరూ సర్వనాశనం అయిపోవాలి. దైవం వారిని వదిలిపెట్టడు. (టేబిలుమీద తలపెట్టి బారున ఏడుస్తాడు.)

బిష— ఊరుకో నాయనా....ఆజైలు ఎలావుంది? నువ్వుఅన్న ఆ నరకం.... సంగతి చెప్పు బాబూ?

హంత— దాన్ని గురించి చెప్పమంటావా? అయితే విను....ఇదివరకు నేను మనిషిని. ఇప్పుడు జంతువుని. నన్ను జంతువులా తయారుచేశారు. క్రూరమృగాన్ని బంధించినట్టు నాకాళ్ళకీ చేతులకీ గొలుసులు తగిలించారు. గొడ్డుని బాదినట్లు బాది వదిలిపెట్టారు. కుళ్ళునూడుతో నన్ను మేపారు. ఈగలూ, దోమలతో మురిగిపోయాను. కటికినేలమీద పడుకున్నాను. గోలపెట్టి అల్లరిచేశాను, ఏడ్చాను. మళ్ళీ చావబాదారు. పదేళ్ళు.... సరిగ్గా పదేళ్ళు భగవంతుడా! నాకు వూరూ పేరూ లేకుండా నాశనం చేశారు. నా మనసుని కృషింపజేశారు. నాలో నరకం సృష్టింపించారు ఒక్కరోజు వాళ్ళు నిర్లక్ష్యంగా వున్నారు. ఈ క్రూరజంతువుని ఒక్కరోజు గొలుసులతో కట్టడం మరిచిపోయారు. అంతే! తప్పించుకు పారిపోయాను. స్వేచ్ఛ పొందాను ఇప్పటికి ఆనరకం వదిలి ఆరువారాలైంది. ఆకలీ, స్వేచ్ఛా అనుభవిస్తున్నాను.

బిష— ఆకలీ, స్వేచ్ఛానా?

హంత—అవును ఆకలే! ఆ నరకకూపంలో తినడాని కింత తిండి పెడతారు. బయట అదీదొరకదు. మలమల మాడిపోవాలి. నాకోసం అంతా గాలిస్తున్నారు. తప్పించుకుపోడానికి నాకు పేరంటూ ఏదీలేదు. నా అనే వాళ్ళు ఎవరూ మిగల్లేదు. అందుకని మళ్ళీ దొంగతనం అరంభించాను. ఈ చింపిరి గుడ్డలు దొంగిలించినవే! ప్రతిరోజూ తిండికూడా ఎత్తుకువచ్చి

తింటున్నాను. రాత్రిపూట అడవుల్లో, గడ్డిమేట్లల్లో తల దాచుకుంటు న్నాను. పని అడిగి చేసే మనోధైర్యంలేదు. ఆఖరికి పట్టణానికిపోయి అడుక్కుతినే సాహసంకూడా కరువైపోయింది. అందుకని గత్యంతరం లేక దొంగనయ్యాను. నేను యిలా అవడానికి వాళ్లేకారణం. నన్ను దొంగగా తయారు చేశారు- వాళ్ళని దైవం శపించకుండా వుండడు. (బ్రాందీసీసా కాళీచేసి దాన్ని చలిమంటలోకి విసురుతాడు.)

బిష — చాలా కష్టాలు పడ్డావు. నాయనా! కాని, మించిపోయిందేమీ లేదు. ఆశ అనేది మిగిలివుం దింకా!

హంత — హహ ....హా.... ఆశా! (వికగబడి నవ్వుతాడు.)

బిష — చాలాదూరం నడిచి అలిసిపోయావు. అదిగో నాపక్క. దానిమీద పడుకొని అలసట తీర్చుకో నాయనా! కప్పుకోడానికి దుప్పటి తెస్తాను.

హంత — ఎవరైనా వస్తే!

బిష — ఎవరూ రారు.వచ్చినా పరవా ఏమీవుండదు. నువ్వు నాస్నేహితుడివి కదూ?

హంత — (ఆశ్చర్యంగా) స్నేహితుణ్ణా!

బిష — అవును! బిషప్ మిత్రుడిమీద వేలుకూడా ఎవరూ మోపసాహసించలేరు!

హంత — బిషప్ మిత్రుణ్ణి! (ఆశ్చర్యంగా తలగోక్కుంటాడు.)

బిష — నేను వెళ్లి దుప్పటితెస్తాను (ఎడంవైపు వెళతాడు.)

హంత — (బిషప్‌వంకచూస్తూ తలగోక్కుంటాడు.) బిషప్ స్నేహితుణ్ణి! (చలి కాచుకోడానికి చలిమంటదగ్గరికివెళ్లి అక్కడేవున్న వెండిసెమ్మెలు చూస్తాడు. చుట్టుపక్కల యెవరైనా వున్నారేమోనని అటూఇటూ చూస్తాడు. అప్పుడు సెమ్మెలనుఎత్తి బరువు అంచనా కడతాడు.) వెండివే? ఎంతబరువుగా వున్నాయ్! భలే గొప్పబేరం! (బిషప్ అడుగులువిని త్వరగా సెమ్మెలు బల్లమీద పెట్టేస్తాడు.)

బిష — (హంతకుడు చేసేదంతా గమనించి మాట్టాడకుండా దుప్పటి పట్టుకుని ఎడంవైపు వెళతాడు.) సెమ్మెలఅందం పరీక్షిస్తున్నావా? అవంటే నాకు చాలాయిష్టం నాకు మా అమ్మగారిచ్చినవవి. ఈ బీదగృహానికి తగిన అలంకారం కావవి, కాని అమ్మని జ్ఞాపకంతెచ్చేవి అవిమాత్రమే నాకు మిగిలాయి. ....నీపక్క సిద్ధంగావుంది. వచ్చి పడుకో నాయనా!

హంత — అలాగే! పడుకుంటాను (ఆశ్చర్యంగా) నేనంటే నీకెందుకింతదయ? (అనుమానంగా) దీనివల్ల నీకు ప్రయోజనం?

బిష – నువ్వు హాయిగా, సుఖంగా నిద్రపోవడంతప్ప నాకేం కావాలి,నాయనా?

హంత – బహుశా నన్ను రక్షించాలనీ, నా మనసుని మార్చాలనీ నీ ప్రయత్న మనుకుంటాను. కాని అదేం లాభంలేదు. తెలిసిందా? నాకీమతం గీతం గాని, నీ వేదాంతంగాని అవసరంలేదు. ఇక చర్చిఅంటావా అదంటేనే నాకు సరిపడదు. అదంటే నాకు మంట. -

బిష – చింతింపవలసినవిషయమే నాయనా! చర్చంటే నీకసహ్యంకావచ్చు కాని నిన్నుచర్చి ఎన్నడూ అసహ్యించుకోదు.

హంత – నన్నుమార్చాలని ప్రయత్నిస్తున్నావా? హాహహా.... భలే మంచి ఆలోచనే! హహహా.... భలే బిషప్‌వి. కాని ఏం లాభంలేదు. నీవు బోధించే భక్తివిశ్వాసాలతోగాని, నీ మోక్షంతోగాని, చివరికి నీ దయతోగాని నాకేం అవసరంలేదు తెలుసా! అనవసరంగా వృథాశ్రమమాత్రం పడకు.

బిష – కరుణామయుడైన ఆదైవాన్ని సేవించడానికిముందు ఎన్నోపాపాలు చేయక తప్పదు తండ్రీ!

హంత – (కోపంగా) నాకు నీవేదాంతం అవసరంలేదని చెప్పలా?

బిష – చాలా పొద్దుపోయింది. పడుకో బాబూ!

హంత – (చిరాగ్గా) సరే! నీకబుర్లు నాకిక యేమీఅక్కర్లేదు ....నేను.... (పక్కదగ్గిరికి వెళ్లి) ఎవరూలేరని నమ్మకమేనా?

బిష – ఎవరూరారు నాయనా. ఒకవేళ యెవరైనా వచ్చినా, రాకుండా నువ్వే తలుపులు వేశావుగదా!

హంత – అవును వేశాను! కాని అవిజాగర్తగా వుంటాయని నమ్మకమేమిటి? (వెళ్లి తలుపులు చూస్తాడు. దుప్పటి పట్టుకునిలబడివున్న బిషప్‌నిచూసి) నువ్వువెళ్లి పడుకో! నేను కప్పుకు పడుకుంటాను. (బిషప్ సందేహిస్తాడు.) వెళ్లు, నేను చెపుతున్నాగా?

బిష – బాగా సుఖంగా పడుకో నాయనా! (వెళ్లిపోతాడు.)

హంత – (బిషప్ వెళ్లిపోయేవరకూ ఆగుతాడు. అతని గదితలుపు వేసివుందో లేదని పరీక్షగా చూస్తాడు.)

హంత – ఒక్కసారి వాటిని మళ్లీచూస్తాను. (దీపపు సెమ్మేలు తీస్తాడు.) కొన్ని వందల ఖరీదుచేస్తాయి. వీటిని మార్చానంటే సుఖంగా జీవితం కొత్తగా ఆరంభించవచ్చు. పాపం! "మా అమ్మయిచ్చిం"దన్నాడు "అవే నాకు మిగిలిన వస్తువులు. అవంటే నాకు చాలాయిష్టం" అనికదూ అన్నాడు.

కాని.... కాని.... నన్ను ఆసరకానికి పంపేప్పుడు మా అమ్మనిగురించిగాని నా భార్యనిగురించిగానీ యెవరూ జాలిపడలేదు. చాలా దయగా చూస్తున్నాడు బిషప్.... ప్రేమాదయా చూపడానికికాకపోతే యీబిషప్‌లు యెందుకూఅని? ఊ.... హూ....లాభంలేదు. మనసా! దయమాట మరచిపో! భగవాన్.... అయ్యో.... దైవమా.... 15729 నెంబరుకు జాలి పుడుతుందేమిటి? మంచిపనే... ఇక లాభంలేదు. ఉదయంవరకూ యిక్కడే వుంటే మతబోధలతో నామనసు మార్చేస్తాడు. తప్పదు. ఈవెండిసెమ్మెలు తీసుకుని యిప్పుడే పోవడం వుత్తమం! బిషప్ అతని బోధా నాశనంగాను.... వెళుతున్నాను. (వెండిసెమ్మెలు తీసి కోటుజేబులో జాగ్రత్తగా దాచుకుని ఎడంవైపునుంచి వెళ్లబోతూంటే గుమ్మం దబుక్కున శబ్దం అవుతుంది.)

పెర — ఎవరది? మిమ్మల్నే మాట్లాడరేం! నిద్ర పట్టనివ్వరాయేం! ఎవరంటే మాట్టాడరు! (కుడివైపునుంచి వస్తుంది.) తలుపు తీసినశబ్దం వినబడింది కాని యెవళ్లూ కనబడరేం! (బిషప్ గదితలుపు తడుతుంది. వెండిసెమ్మెలు బల్లమీద లేకపోవడం గమనించి) వెండిసెమ్మెలు పోయినయ్యి అన్నయ్యా! నిన్నే.... రా యివతలికి. సెమ్మెలు కాజేశారు. కొంప మునిగింది. దొంగలు.... హత్యా.... (బిషప్ మెల్లిగా ప్రవేశిస్తాడు.)

బిష — ఏమైందమ్మాయీ? ఏంజరిగిందసలు?

పెర — పారిపోయాడు. వాడు ఆ అకలికళ్లవాడు వెండిసెమ్మెలు ఎత్తుకు పారిపోయాడు.

బిష — ఏమిటమ్మా నువ్వనేది! నావెండిసెమ్మెలా? (నిట్టూర్చి) ఏంచేయను.... చాలాబాధగావుంది. చివరికి అవికూడా నాకువదిలాడుకాదు. నాకుమిగిలినవల్లా అవొక్కటే! (కూర్చుండిపోతాడు.)

పెర — వెళ్లు! పోలీసులదగ్గరికి ముందు వెళ్లు. ఎంతోదూరం పోయివుండడు. వాడు దొరికితే వెండిసెమ్మెలు దొరికినవన్నమాటే! దొంగవెధవని యింట్లో పెట్టుకున్నావు. తగినశాస్తి చేశాడు. అసలు వాటిని వాడు తీయకుండా వుంటాడని యెలాఅనుకున్నావు?

బిష — నువ్వు అన్నది నిజమమ్మాయీ. తప్పునాది. నామూలంగానే అతనికి ఆశపుట్టింది.

పెర — ఏం పిచ్చిమాటలవి. వాడికి నువ్వు ఆశ రేపెట్టడమేమిటి? వాడు దొంగ, గజదొంగ, వాడిముఖం చూడగానే అనుకున్నాను. నువ్వువెళ్లి పోలీసులికి

చెప్పకపోతే నేనైనావెళ్లి చెప్పితీరుతాను. (అని వెళ్లబోతుంది. అతను అపుతాడు)

బిష – మళ్లీ అజైల్లోకే పంపమంటావా? (నెమ్మదిగా) తిరిగి ఆనరకంలోకి పంపనా? వీల్లేదు.... హు... హూ వద్దు. పెరసోమ్ వద్దు. నాకు తగినశాస్తి అయింది. ఆ సెమ్మేల కీయగూడని విలువ యిచ్చాను. అది పాపంకదూ! నాకు దైవం మంచిశిక్ష విధించాడు. నాకిది భరించలేనికష్టం. చెప్పలేని దుఃఖం. (రెండుచేతులతో ముఖం కప్పుకుంటాడు.)

పెర – వీల్లేదు. వాణ్ణి అప్పజెప్పాల్సిందే. నువ్వు చెప్పేదితప్పు. నువ్వు వెళ్లక పోయినా నేను వెళ్లి పోలీసులికి చెప్పుతాను. నా అన్నయింట్లో సామాన్య మైన ఒక గజదొంగపడి దోచుకుపోతే నేను చూచి సహించలేను. నీవు నాఅన్నవనీ, నా బిషప్పవనీ, ఫ్రాన్సుఅంతట్లో నీఅంత మంచిమనిషి లేడనీ ఎరుగుదును. కాని, నీఅంత పిచ్చివాడూ, అమాయకుడూ మరి యెవ్వరూ వుండరు. నువ్వు పసివాడితో సమానం. నీమంచిని ఈవిధంగా ఇతరులు దుర్వినియోగం చేసుకోడానికి నేను ఒప్పుకోను. నేను పోలీసులదగ్గిరికి వెళుతున్నాను. (వెళ్లబోతుంది.)

బిష – అగు! పెరసోమ్! అగు. ఆ వెండిసెమ్మేలు యిదివరలో నావికావచ్చు కాని యిప్పుడవి అతనివి. నాకన్నా వాటితో అతనికే యెక్కువ అవసరం వుంది. అమ్మ నిజంగా యిప్పుడు బతికివుంటే వాటిని తప్పకుండా అతనికి దానంచేసేది.

పెర – కాని.... (బయట ధనధనా తలుపుశబ్దం)

పోలీసోద్యోగి – (బయట) అయ్యా! మీతో కొంచెం పనివుంది. లోపలికి రావచ్చా?

బిష – రా నాయనా, రా! (పోలీసుయినిస్పెక్టరూ, పోలీసుభటులూ ప్రవేశిస్తారు. హంతకుణ్ణి బంధించి వెంటతీసుకువస్తారు. ఇనిస్పెక్టరు చేతిలో వెండి సెమ్మేలు వుంటాయి.)

పెర – దొంగవెధవా? దొరికావురా వాళ్లకి!

ఇన్స్పె – రోడ్డుమీద నక్కినక్కి నడుస్తుంటే అనుమానంతగిలి పలకరించాం. బెల్లంకొట్టిన రాయిలా సమాధానం చెప్పకపోయేసరికి అనుమానంహెచ్చి పట్టుకున్నాం. పోతులా వున్నాడేమో ఒకపట్టాన్న లొంగలేదు. మా పెను గులాటలో జేబులోంచి యీదీపపుసెమ్మేలు కింద జారిపడ్డాయి. వీటిని తమయింట్లో చూసినట్టు గుర్తు. వాటినితెచ్చి మీకుచూపిస్తే ఆనవాలు

పడతారని వీట్ని తీసుకువచ్చాం.ఇవి మీవైతే తీసుకోండి వీట్ని సైన్లో పారేస్తాం

(హంతకుడూ, బిషప్ వొకరిముఖం వొకరు చూసుకుంటారు. హంతకుడు 'నన్నేం చేయగలరు మీరు?' అన్నట్టు నిర్లక్ష్యంగా చూస్తాడు.)

బిష — నాకు నువ్వు చెప్పేదేమీ అర్థంకావడంలేదు. ఇతను నా స్నేహితుడు.

ఇన్స్పె — అయ్యో దేముడా! వీడు మీకు స్నేహితుడా ?

బిష — అవును.... రాత్రి నాతో భోంచేశాడు. తరువాత నేనే ఆవెండిసెమ్మేలు యిచ్చాను.

ఇన్స్పె — (అపనమ్మకంతో) నిజమేనా యిది....మీరు.... మీ వెండిసెమ్మేలు వీడి కిచ్చారా? దేవుడా ! ఏమిచోద్యం !

బిష — (కోపంగా) దేవుడంత చులకనగా లేడు !

ఇన్స్పె — క్షమించండి, అయ్యగారూ !

బిష — అతన్ని వదిలిపెట్టండి. అతనిదార్ని అతను పోతాడు.

ఇన్స్పె — నువ్వెవరవంటే మాట్లాడడు. పోనీ నీపేరు చూపించే కాగితమైనా యివ్వమంటే కదలడు.

బిష — అతను నాస్నేహితుడని చెప్పేక యిక ప్రశ్నించవలిసిన పనిలేదు.

ఇన్స్పె — అవునవును.... మీ స్నేహితుడైతే మంచిదే.... కాని....

బిష — అతడు మిబిషప్ స్నేహితుడు. నీకంతకన్నా యేంకావాలి ?

ఇన్స్పె — కాని....

బిష — ఏమిటది? (బిషప్ ఇన్స్పెక్టరూ ముఖముఖాలు చూసుకుంటారు.)

ఇన్స్పె — నేను.... నేను.... బందీని వదిలిపెట్టండి ! (పోలీసుభటులు దొంగని వదులుతారు) రైట్ ఎబోట్ టరన్, మార్చ్

(ఇన్స్పెక్టరూ, పోలీసుభటులూ వెళ్లిపోతారు. కొంచెంసేపు నిశ్శబ్దం)

హంత — (కలలోలా, నెమ్మదిగా) ఆవెండిసెమ్మేలని నువ్వే నాకు యిచ్చావని చెప్పావు! నాకు ఇవ్వడమే! దైవమా!

పెర — (చేత్తో బెదిరిస్తూ వెండిసెమ్మేలని హృదయానికి హత్తుకుని) వెధవా, దొంగవెధవాఅని. యిక్కడికివచ్చి తల దాచుకున్నావ్. అన్నం తిన్నావ్. పడుకున్నావు. పైగా తిన్నయింటికి వాసాలు లెక్కపెట్టావు. నువ్వు దుర్మా

ద్రోహివి గజదొంగవి. విశ్వాసఘాతకుడివి. మోసగాడివి. అన్నంపెట్టినచేతినే నరుకుతావా ?

బిష — పెరసోమ్, నువ్వు చాలా అలిసిపోయావు. వెళ్లి పడుకో అమ్మా!

పెర — ఏమిటీ! నిన్ని దుర్మార్గుడిచేతుల్లో వొదిలిపెట్టి వెళ్లనా. మళ్లీ నిన్నే దైనా మోసమైనా చేస్తాడు, చంపనైనా చంపుతాడు. నేనిక్కడనుంచి కదలదల్చుకోలేదు.

బిష — (గట్టిగా) వెళ్లు అమ్మాయి! మమ్మల్ని కొంచెంసేపు వంటరిగా వదలు. (అన్నగారివంకచూసి తనగదివైపు వెళుతుంది.)

పెర — సరే, అలాగేవెళుతున్నాను. వెళ్లేటప్పు డీవెండిసెమ్మెలు పట్టుకు మరీ వెళతాను.

బిష - (కొంచెం చురుగ్గా) ఆ వెండిసెమ్మెలని బల్లమీదపెట్టి మరీ వెళ్లు అమ్మాయీ !

పెర — నేను అక్కడ పెట్టదల్చుకోలేదు వాటిని.

బిష — (కోపంగా) బిషప్‌గా నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను.

(పెరసోమ్ వెండిసెమ్మెలు అక్కడేవదిలి వెళ్లలేక వెళ్ళలేక వెళ్లి పోతుంది.)

హంత — (సిగ్గుతో) ఆసెమ్మెలను అపహరించుకు పోనందుకు చాలా సంతోషిస్తున్నాను. నాకే వింతగాఉంది. కాని నిజంగా సంతోషిస్తున్నాను.

బిష - నీ పక్క సిద్ధంగావుంది. పడుకోవూ ?

హంత — (సెమ్మెలవంకచూసి) ఊహూ.... వద్దు. నాకు ధైర్యంలేదు. నేను వెళ్లిపోవాలి. పారిస్‌కు వెంటనే వెళ్లకతప్పదు. అది మహాపట్టణం. ఆ జనసముద్రంలో కలిసిపోతాను. రాత్రుళ్లే నేనుప్రయాణం చేయవలసి వుంటుందని మీకుతెలుసుగా ?

బిష — అవును .... అర్థమైంది. నువ్వు రాత్రిపూటే ప్రయాణంచేయాల్సి వుండడం నిజమే.

హంత — ఈలోకంలో మంచితనం అనేది వుంటుందని నేను నమ్మలేక పోయాను. బహుశా ఆ జైలునరకంలో వున్నవారెవరికీ మంచిమీద నమ్మకముండదనుకుంటాను. కాని మిమ్మల్ని చూసినదగ్గిరనుంచీ మీరు చాలా మంచివారని నమ్మకం కలిగింది. ఆశ్చర్యపడకండి. మీరేమీ అను

కోకపోతే నేను వెళ్ళేముందొక్కసారి నన్ను మనసారా దీవించండి. నాకెంతో వుపకారం చేశారు మీరు. (సిగ్గుతో తలవంచుకుంటాడు.)

(బిషప్ సిలువముద్రవేసి నెమ్మదిగా దీవిస్తాడు. హంతకుడు మాట్లాడబోతాడు కాని కంఠం రుద్ధమౌతుంది.)

హంత – శెలవు !

బిష – ఒక్క నిముషం ఆగు, నాయనా ! ఇదిగో నీసొమ్ము.

హంత – నిజంగా నన్ను తీసుకోమనేనా మీవుద్దేశ్యం ?

(ఆశ్చర్యం ఆనందం మిళితంకాగా వెండిసెమ్మెలు అందుకుంటాడు.)

బిష – తప్పకుండా తీసుకో, నాయనా. అవి నీకుపయోగపడతాయి. మా యింటికానుకునివున్న అడివిలోంచి వొకకాలిబాట పారిస్‌కు పోయేది వుంది. ఆదార్ని సాధారణంగా యెవరూ నడవరు. పైగా మనస్నేహితులు పోలీసులీ రాత్రిపూట అలాటిదారిలో నడవడానికి మరీజంకుతారు.

హంత – కృతజ్ఞుణ్ణి (ఏడుస్తాడు). నేను వట్టిపిచ్చివాణ్ణి. పిల్లాడిలా ఏడుస్తున్నానుకోకండి. మీరు నన్ను పిల్లాడిలాచేశారు. నాలో ఏదో కొత్తదనం, మృదుత్వం ప్రవేశపెట్టారు. నన్ను మళ్లీ మనిషినిచేశారు. నాలోంచి పశుత్వం తొలిగిపోయింది. (వెనకగుమ్మం తీసి అక్కడ నిలబడతాడు.)

బిష – (భుజంమీద చెయ్యివేసి) నాయనా, నీచిన్నదేహం అకరుణామయుని గృహమనిమాత్రం మరిచిపోకు.

హంత – (భయసంభ్రమాలతో) దైవనికేతనం ! ఎన్నడూ మరిచిపోను.

(తలుపువేసి బిషప్ కిటికిదగ్గిర నిలబడతాడు. తరువాత మోకరిల్లి ప్రార్థన చేస్తాడు.)

మెల్లిగా తెర పడుతుంది.



# కడసారి యుద్ధం

## పాత్రలు

1. సింహం
2. పాము
3. కోతి
4. సూక్ష్మజీవి (మైక్రోబ్)
5. గుర్రం
6. ఆడసింహం
7. బిల్ (పెంపుడుకుక్క)
8. దేవదూత
9. బిల్ (సైనికుడు)

## రంగం

(అడవిలో పచ్చికబయలు — అంతానిశ్శబ్దం: సింహం దాని భార్యా కూచునివుంటాయి. పామూ, గుర్రం ప్రవేశిస్తాయి. అంతా సభకోసం ఎదురుచూస్తున్నట్టు వుంటారు.)

సింహం — ఏం, ఎక్కడన్నా ? —

గుర్రం — పత్తా, ఫికరూలేదు.

పాము — ఇక్కడా అంతే. (ఆనందంతో బుసగొడుతుంది.)

గుర్రం — (సింహంతో) మీమాటేమిటి ?

సింహం — తుడిచిపెట్టుకుపోయాడు.

కోతి — (ప్రవేశించి సంతోషంగా చెట్టుకొమ్మఒకటి అందుకుని కూర్చుంటుంది) ఓహో....ఓహో...

ఆడసింహం — నమస్కారం వానరా !

కోతి — నమస్కారమమ్మా !

గుర్రం — ఏం, ఎక్కడన్నా ?

కోతి — అంతా గాలించేశాను. ఎక్కడా కనిపించలా.... హాయిగా.... ఆనందంగా బతకొచ్చునిక.

పాము — ఆఫ్రికాసంగతి ?

కోతి — ఆఫ్రికా హాయిగావుంది.
సింహం — ఎవరు చెప్పారు ?
కోతి — కొంగలు. దక్షిణాన్నుంచి వచ్చాయవి. కోయిలలూ ఆమాటే ధృఢ పరిచాయి....
పాము — అయితే మచ్చుకయినా లేనట్టేనా ? ('లేనట్టే' అని కోతి తలఊపు తుంది) తుదకి నల్లవాళ్ళయినా లేనట్టే ?
కోతి — (ఆనందంతో) ఒక్కడుకూడా లేడు. హాయి.... హాయి.... ఎంత గొప్పగావుందో ! (చెట్టుకొమ్మపట్టుకు ఊగుతుంది.)
గుర్రం — ఆసియా తిరిగీ బతికేవుందని విన్నావా.... జెరూసలేమ్, బాగ్దాద్ పెకింగు, టోకియో.... అన్నీ ఎడారిలా నిశ్శబ్దంగా ఉన్నాయి.
పాము — చైనా కిన్నాళ్లకి శాంతి దొరికింది పాపం. భారతదేశం గొడవలన్నీ శాశ్వతంగా తీరిపోయాయి.
ఆడసింహం — సముద్రాలమాటేమిటి ? సముద్రాల్లో ఎక్కడా అతడి గుర్తు లేదుకదా ?
గుర్రం — పూర్వం ఒకప్పుడు వున్నట్టే, అంటే కొన్ని శతాబ్దాల క్రితం వున్నట్టే వుంది, ఇప్పుడు సముద్రం.
ఆడసింహం — మరి ఆకాశంమీదా ? ఏమంటారు ?
కోతి — (సంతోషంగా) అక్కడా ఎంతోకాలం వుండలేపతడు. మీదా! క్రిందా! ఇక్కడా ! అక్కడా ! అంతాశూన్యం ! నిశ్శబ్దం (ఊగుతుంది.)
ఆడసింహం — స్నేహితులారా ! అందరూ కూచోండి.

(అందరూ కూచుంటారు. కోతిమాత్రం అటూఇటూ గెంతుతూ వుంటుంది.)

గుర్రం — (అంతర్నిచూసి) బాగుంది.... చాలాబాగుంది.... దివ్యంగావుంది. ఒక విషాదగాథకి ఇది అంతమన్నమాట !
కోతి — దివ్యమైనదని సైగా.
పాము — పీడాలేకుండా పోయింది. (బుసకొడుతుంది.)
సింహం — వాళ్లంటూ లేకపోతే ఈప్రపంచం, నందనవనంలా వుంటుందని చెప్పగలను.
ఆడసింహం — అవును.... హాయిగా వుంటుంది జీవితం. ఎవరి బాధ్యత వాళ్లకి తెలుసు. తెలియందీ అతడొక్కడికి మాత్రమే !

గుర్రం — వాళ్ళే కావాలని కోరుకున్నారిది.
పాము — వద్దమ్మలు. ఒట్టి తెలివితక్కువ జాతి.
ఆడసింహం — (గుర్రంతో) నిజమే. నువ్వు వాళ్లని బాగా ఎరుగుదువు గదూ?
గుర్రం — అవును, తరతరాలనించీ మాజాతి వాళ్ళతో పనిచేసింది. అయిష్టం గానే అనుకోండి. వాళ్ళంటే మాకెప్పుడూ ఇష్టంలేదు.
పాము — ఎవరితోనూ పడదు; వట్టి చంచలచిత్తులు; నిరంకుశులు. దుర్మార్గం మోనం వాళ్ళసొత్తు. వెర్రిపీనుగులంపరూ ఇంతే (బుసకొడుతుంది.)
గుర్రం — మాజాతి కీరాబోయే అనర్థం కొన్ని శతాబ్దాలకి ముందేతెలుసు.
పాము — వాళ్ళకితప్ప సృష్టిలో అందరికీ తెలుసీవిషయం.
కోతి — (సంతోషంగా ఊగుతూ) మంచిశాస్తి అయింది!
ఆడసింహం — (కోతితో) వానరా! నీకూ వాళ్ళ సంబంధం ఉందా?
కోతి — పచ్చిఅబద్ధం! అబ్బే. ఏమాత్రం చుట్టరికంలేదు. అసలు ఈ అబద్ధపు ప్రచారం ఎవరు చేశారో నాకర్థం కావడంలేదు. కొంచెంకూడా నిజానికీ దీనికీ సంబంధంలేదు. అజాతితో ఏమాత్రం సంపర్కం వుందనితెలిసినా తోక తెగ్గోసుకుంటాను.
సింహం — నిజానికి వాళ్ళను సృష్టించడమే చాలా గొప్పపొరపాటు. (అవు నవునని అందరూ తల లూపుతారు.)
ఆడసింహం — వాళ్ళెందు కిలాటి పనిచేశారో నాకర్థం కావడంలేదు.
పాము — ఏముంది! వట్టి తెలివితక్కువతనం.
ఆడసింహం — (మగసింహంతో) వాళ్ళలా మనంకూడా ఒకళ్ళనొకళ్లు చంపుకు తినం. తుదకి మన సర్పానికికూడా స్వజాతి మీదెంతో అభిమానం. కోతులుకూడా కిచకిచలాడుతూ యుద్ధం చేస్తాయేగాని ఒకదాన్ని ఒకటి చంపుకోవు.
సింహం — మనిషంటే మనిషికి పగ.
గుర్రం — అందుకే సర్వనాశనమైపోయాడు శాశ్వతంగా.
కోతి — దేవుని వైభవం!
ఆడసింహం — సాటివాళ్ళని చంపితే తమనితాము చంపుకోడమే అని కూడా తెలుసుకోలేకపోయారు.
పాము — వట్టి వెర్రివాళ్ళంటే నమ్ము
సింహం — అందరికీ సరిపోయే అంత తిండుంది!
కోతి — పళ్ళూ, పప్పులూ, రొట్టెలు... ఒకటేమిటి సమస్తం కో కొల్లలుగా

ఉన్నాయి వాళ్ళకి. వాళ్ళకి తృప్తిమాత్రం ఎప్పుడూలేదు. కాకపోయినా వాళ్ళు కోతులుకారుగా జ్ఞానంకలిగి ఉంటానికి.

సింహం — నామట్టుకునేను ఆకలిగా ఉన్నప్పుడు తప్ప మిగతా వాళ్ళజోలికి పోను. ఎప్పుడూ తోటిసింహాలతిండికి అడ్డుతగలను.

పాము— వాళ్ళు వట్టిచుప్పనాతులు. వాళ్ళకి ఒకళ్ళనిచూస్తే ఒకళ్ళకి గిట్టవ నేమాట మనం మరిచిపోకూడదు. అందుకనే నాశనమైపోయారు. (బుస్)

ఆడసింహం — ఎంతమంది ఎంతమందనీ!

సింహం — నల్లవాళ్ళూ, పచ్చవాళ్ళూ, ఎర్రవాళ్ళూ, తెల్ల............

గుర్రం — ఎర్రాళ్ళని ఎప్పుడో రూపులేకుండా చేశారు. ఎంతఘోరానికి ఒడి గట్టుకున్నారు .... దీంతోనే ఆరంభమైంది. వాళ్లపతనం....వాళ్లగొయ్యి వాళ్ళే తవ్వుకున్నారు.

ఆడసింహం — అందరికన్నా తెల్లాళ్ళు మరీచెడ్డవాళ్లు. (అందరూ "అవునవును ముమ్మాటికీ!")

పాము — నల్లాళ్ళతో దాస్యం చేయించుకున్నారు. పచ్చాళ్లకోపాన్ని రగులు కొల్పారు. దాంతో ఈ చివరియుద్ధం అంతా తుడిచి పెట్టేసింది. (బుస కొడుతుంది.)

గుర్రం — ఆఖరికి తెల్లాళ్ళందరూ ఏకమైనా బాగుండేది....ఊహూ....వాళ్ళు కలవరుగా!

పాము— వాళ్లా కలిసివుండేది! జీవితంలో వాళ్లకి యుద్ధం అత్యవసరమైపో యింది. మానవత్వం మరిచిపోయారు. కత్తి ఎప్పుడైతే చేతికొచ్చిందో సర్వనాశనం అప్పుడే ఆరంభమైంది. (బుసకొడుతుంది.)

గుర్రం — నేను జర్మను దేశస్థుణ్ణని ఒకడూ, నేను ఫ్రెంచివాణ్ణని ఇంకోడూ, నేను ఇంగ్లీషు వాడినని మరోడూ కాదు నేను ఐరిష్ వాడినని ఇంకోడూ అనుకుంటూఆటారు. తెలుసా ?

పాము — పనికిమాలిన మాటలు.

గుర్రం — ఇలాటి భేదాలుపెట్టుకునే తరతరాలనుంచీ కత్తీ కర్రా పట్టుకు కూర్చున్నారు. (నవ్వులు) ఈవిషయం మా వాళ్ళందరికీ బాగా తెలుసు.

పాము — మరెప్పుడూ మీ జాతిజోలికి రారు.

గుర్రం — బతికిపోయాం!

కోతి — క్రూరులైపోయారు........జీవితంలో అందానికీ సొగసుకీ దూరమై పోయారు....... హెూయ్... హెూయ్ (అని ఊగుతుంది.)

గుర్రం — దూకుడుగా, రివ్వుమని పోవాలనే వెర్రిమాటేమిటి?
సింహం — అన్నీ అలుముకుందామనే ఆశపోతుతనమో!
ఆడసింహం — అందరిమీదా అధికారం చెలాయిద్దామనే బుద్ధో!
పాము — అన్నీ పాడుచేద్దామనేగా.... ఈ నాశనంచేసే బుద్ధిఉందే....
గుర్రం— తేలిగ్గా పల్టీకొట్టించింది. చివరికి గుర్రాలకికూడా నవ్వులపాలయ్యారు.
ఆడసింహం — సంస్కారం ఉంటేగా!
పాము — ఒళ్లు గగుర్పొడుస్తుంది తలుచుకుంటేనే!
గుర్రం— మధ్యమధ్యలో పిచ్చి ఆవేశించేది. మేం మా గుర్రపుశాలల్లో అది చూచి వణికిపొయ్యేవాళ్లం.
ఆడసింహం — పిచ్చా?
గుర్రం — ఆత్మవంచన!
సింహం — దీనికి లక్షణాలు?
గుర్రం — జాతీయగీతాలంటూపాడుతూ జండా లూపుకుంటూ బారులుతీర్చి మేళతాళాలతో రాజకీయమైన ఊరేగింపులు జరుపుతూ చరాచరాత్ముడూ సృష్టికర్తాఅయిన ఆపరమేశ్వరుణ్ణి తమ స్వజాతివాడిగా చేసిపారేశారు.
ఆడసింహం — ఎంత సిగ్గుచేటూ!
గుర్రం — చెప్పడానికేముంది, అందరూ ఒళ్ళుమరిచిపోతారు. ఇందులో ఎవరిదీ ఆధిక్యంఅంటే చెప్పడం కష్టం. మతంపేరు చెప్పుకుని పూజార్లూ.... దేశంపేరు చెప్పుకుని రాజకీయవేత్తలూ.... ఏదైనా పర్యవసానం నీకు తెలుసుగా...
కోతి — కళ్ళుతెరవని పసికందులు...వట్టి అమాయకులు....కాని వీళ్ళ దగ్గర భయంకరమైనవీ, వికృతమైనవీ ఆటసామానులున్నాయి.....పైగా అవి మారణయంత్రాలు...అసహ్యకరమైన సామాను.
పాము — పూర్వం ఈడెన్*లో మా వంశఋషి ఒకాయన గొప్పపరిశోధనలు చేశారు....వారికి మనిషంటే చాలా అసహ్యం (బుసకొడుతుంది)
ఆడసింహం — ఆకథ మళ్ళీ ఓసారిచెప్పు సర్పం! (కోతితప్ప మిగిలినవన్నీ పాముచుట్టూ చేరుతాయి.)
పాము — ముందునుంచీ చివరిదాకా మనిషి తెలివితక్కువ కథేఅది. 'ఈడెన్' సంపాయించి ఇయ్యండి. దాన్ని, నిముషాల్లో పోగొట్టుకుంటాడు. తెలివి ఈయండి. దాన్ని దుర్వినియోగం చేస్తాడు. చేతులిస్తే మారణయంత్రాలు

* బైబిలులోని నందనవనం.

తయారు చేశాడు. మంచి ఉద్యానవనం ఇస్తే దాన్ని పాడు పెడతాడు. చక్కని కల కాయిస్తే దాన్ని పీడకల చేస్తాడు. గొప్పప్రవక్తనీ శాంతి దూతనీ ప్రసాదిస్తే రాళ్లు రువ్వి మేకులు దిగగొట్టి చంపుతాడు. మైదానాల్లో వారీతెన్నూ కానక ఎముకలన్నీ అరిగి అరిగిపోయి చచ్చిపడిన వెనకటి 'మేఘథేరియమ్'లా మనిషి నశించిపోతాడు. అందుకే మిత్రులారా! నా ఉద్దేశ్యం....

కోతి — ఉండండి! నిశ్శబ్దం.

[అందరూ చుట్టూ మూగుతారు. బిల్ అనే 'స్పానియల్' జాతి కుక్క ప్రవేశిస్తుంది. అందరూ దాన్నిచూచి దూరంగా జరుగుతారు. 'నాఅపరాధాన్ని క్షమించండి' అన్నట్టు జాలిగాచూస్తుంది.]

బిల్ — నమస్కారాలు (ముడుచుకుపోతుంది.)

పాము — ఏమిటీ బిల్! నీది చాలా దురదృష్టం!

బిల్ — ఏంచేయను! క్రమంగా సరిపెట్టుకుంటాను.

కోతి — ఈలపాటకూడా వినబడ్డంలేదా బిల్?

బిల్ — నా వినికిడిశక్తి మంచిదే. కాని ఇంతవరకూ వినబళ్లా!

ఆడసింహం — (జాలిగా) ఎంత వెర్రివాడివి బిల్! చెడ్డస్నేహం ఎంత కొంప ముంచిందో చూశావా?

గుర్రం — మేమూ వాళ్లకోసం పనిచేశాంగాని, వాళ్లస్నేహం ఎప్పుడూ కోరలా మాఇద్దరిమధ్యా ఆదూరం అల్లానే అట్టిపెట్టుకున్నాం.

పాము — వాళ్ళు నాకు పరమశత్రువులు! (బుసకొడుతుంది.)

కోతి — వాళ్లచేష్టలంటేనే నాకు నవ్వువస్తుంది.

సింహం — వాళ్లంటేనే నా కసహ్యం.

ఆడసింహం — బిల్! వాళ్లంటే నీకు చాలా ప్రేమకదూ?

కోతి — అలాటి వాళ్ళంటే ఇష్టమని చెప్పడానికి సిగ్గులేదూ?

బిల్ — ఏంచెయ్యను? ప్రేమించకుండా ఉండలేకపోయాను.

గుర్రం — పాపం! వాళ్లు లేనిలోటు చాలాకనిపిస్తుందా?

బిల్ — నిజంచెప్పాలంటే అంతే.

పాము — ఇంత తెలివిమాలినవాళ్లతో ఎలా ముడిపెట్టుకున్నావో అర్థం కావడం లేదు.

ఆడసింహం — ఇటువంటి పిచ్చిపని మనలో మరెవళ్ళూ చెయ్యలా. అఖరికి

మీజాతివాళ్ళూ, మీకు తాతానహోదర్లూ అయిన నక్కలుకూడా ఆత్మాభిమానం నిలబెట్టుకుని దూరంగానే ఉన్నాయి.

బిల్ — మీరు చెప్పింది నిజంకావచ్చు. మీఅందరికీ వాళ్లంటే భయం.... అయిష్టం.... కాని మేం వాళ్ళని మనస్ఫూర్తిగా ప్రేమించాం మీరన్నట్టు.... భగవంతుడా.... ఏంచెయ్యను.... ఎంతకష్టమైనా అనుభవించకతప్పదుగదా!

గుర్రం — వాళ్ళంటే మీరెందుకంత పడిచస్తారో మాకు బుర్రబద్దలకొట్టుకున్నా అర్థంకావడంలేదు.

బిల్ — మనిషికి మంచిగుణాలు చాలాఉన్నాయి.

పాము — చాలుచాలు!

బిల్ — మీకు వాళ్లల్లో లోపాల్లా కనబడే గుణాలే, నాకు నచ్చాయి.

సింహం — అర్థంకాలా. విప్పిచెప్పు.

బిల్ — క్షమించు కేసరీ! నేను విప్పిచెప్పవల్చుకోలేదు. నిజం చెప్పాలంటే వాళ్లు లేకపోవడం నాకు చాలాబాధగాఉంది.

ఆడసింహం — ఎంత దౌర్బల్యం!

బిల్ — చిరకాలబంధాల్ను తెగిపోతే హృదయదౌర్బల్యం తప్పదు. ఇదినిజం. (యజమాని కోసమా అన్నట్టు వాననచూస్తుంది.)

కోతి — బిల్! ఏదీ; ఇలాచూడు అలా విచారిస్తే ఎలాచెప్పు.

బిల్ — నువ్వూ నాలా అతనితో సహచారిగా కొండల్లో కోనల్లో తిరిగి వేటాడలేదు. చలికాలంలో అతనితోపాటు హాయిగా వెచ్చగా కుంపటిదగ్గిరే కూచుని కునుకు తీయలేదు.

కోతి — ఆమాటలకేంగాని! చూడు. నేను నాపొట్టకోసం పాటుపడుతున్నట్టు నువ్వూ నీదుమ్ములకోసం కష్టపడడం నేర్చుకో. అలాఅయితే ఎవర్నీ నీ యజమాని అని చెప్పుకోనక్ఖరలేదు. హొాయ్.... హేయ్.... ఏండోళ్లు వెధవడోళ్లనీ!

పాము — మనిషి లేకపోవడంవల్ల ప్రపంచం సుఖంగాఉందని ఒప్పుకుతీరాలి!

బిల్ — నేనొక్కణ్ణే అతని స్నేహితుణ్ణి కావడంచేతా, సాన్నిహిత్యంవల్లా అతనిలో లోపాలు నాకు కనబడవు.

ఆడసింహం — హారిదేముడా! అంత ప్రేమించాల్సిన గుణా లతనిలో ఏం కనిపించాయి నీకు?

బిల్ — తరుచూ ప్రేమాభిమానాలు నామీద ఒలకబోసేవాడు.
గుర్రం — వట్టిమాట !
బిల్ — ఎప్పుడూ నాకోసం ఏదోఒకటి ఇస్తూంటాడు....
సింహం — తను తిన్నతరువాత !
బిల్ — అవన్నీవద్దు ! పోనీ చాలా తెలివిగలాడని ఒప్పుకుంటావా ?
పాము — నిజమే! అందుకనే అతి తెలివితేటలమూలంగా భూమ్మీదే లేకుండా పోయాడు.
బిల్ — అవును! ఒకొక్కప్పుడు నాకూ అనిపించేది, అతిగా చేస్తున్నాడని.... కాని చెప్పాల్సినవాడిని నేనుకాదుగా ?
కోతి — ఇంతకీ, బిల్! వట్టిమమకారం ఒలకబోసే మనిషి. అసలు ఈభావు కులేఇంత ! మానవుడినైజం అందరికీ అర్థమైంది. అందుకని కొందరం దూరంగా ఉన్నాం. కొందరం రోజులు గడిపేసుకున్నాం మంచిరోజుల కోసం ఎదురుచూస్తూ ! బిల్‌లా ఈ రెండుకాళ్ళవాడిని పట్టుకుని ఎవరం పాకులాడలేదు. జాత్యభిమానం మంటకలిపేశాడు .... దీనిక్కారణం ఈలవేసి పిలిచేనోరు మనిషికుండడం.... ఆడించేచేతిక వీపికుండడం....
ఆడసింహం — మంచిపాఠం నేర్చుకున్నావు. ఇకనైనా బుద్ధిగా మసలుకో!
బిల్ — పాఠంవిన్నాను.... కాని మనిషి నిజంగా లేడంటావా ?
గుర్రం — వెర్రివాడా... ఇంకెక్కడి మనిషి.... విన్నావుగా నాలుగుమూలల నుంచీ వచ్చినవార్తలు.... అందరూ చెప్పారు దీన్ని ధృఢంగా...చేపలూ... పక్షులూ కూడా చివరికి గాలించి చూచామన్నాయి. ఎక్కడా పత్తాపికరూ లేదు.... అంతం.... అయిపోయింది.
బిల్ — (చాలావిచారంగా) మళ్ళీ తిరిగొచ్చే ఆశేలేదా ?
గుర్రం — హరి దేముడా ! వాళ్ళు మళ్ళీ రావాలా ?
బిల్ — (కంగారుగా) లేదు... లేదు... అదిగాదు.... చూడు.
పాము — నీ అనుమానాలకి సమాధానాలు చెప్పేవాళ్ళు ఇక్కడేవున్నారు చూడు బిల్ !
ఆడసింహం — ఎవరు వారు ?
సింహం — నువ్వా సూక్ష్మజీవీ.... జిమ్.... ఎలాఉన్నావ్ ?

(సూక్ష్మజీవి — జిమ్ ప్రవేశిస్తుంది. చూడ్డానికి విచిత్రంగా వుంటుంది. మాటలో నడకలో ఏదో,ఏదో ప్రత్యేకతా వుంటాయి.)

ఆడసింహం – నమస్కారం.... చాలా అలిసిపోయినట్టున్నారు ?
సూక్ష్మజీవి – నమస్కారం ! అవునమ్మా అలిసిపోయాను.
సింహం – మీకు చాలాఋణపడ్డాం.... ఇదంతా మీవల్ల!
సూక్ష్మజీవి – ఆ రవంత బాధ్యతా తప్పితే, నేను చేసిం దేముంది.
పాము – అలా అనకు. చాలా మంచిపని చేశావు.
సూక్ష్మజీవి – (కూర్చుంటుంది) చాలా ధన్యవాదాలు. విశ్వవిద్యాలయంచదువు ఎంతైనా చేస్తుంది.
గుర్రం – పూర్తిగా సఫాఅయింపంటావా?
సూక్ష్మజీవి – కోరి చేతులారా తెచ్చుకున్నాడు. అంతేనా?
ఆడసింహం – అవును, అనుకున్నట్లే జరిగింది.
సూక్ష్మజీవి – మనిషంటే అసలు నాకు కొంచెంకూడా కోపంలేదు. నన్ను చాలాబాగా చూశాడు... కాపాడాడు జాగ్రత్తగా ....చక్కగా పోషించాడు ....అన్నివిధాలా సంరక్షించాడు ...ఎంతో గారాంపెట్టాడు.... పరిశోధనా లయాల్లో ఆటభూముల్లోలా ఆనందంగా గడిపాను.
ఆడసింహం – ఎందు కింతప్రేమగా చూశాడో చెప్పగలవా ?
గుర్రం – మిమ్మల్ని పెంచడం తనకే ముప్పని తెలియదా ?
సూక్ష్మజీవి – ఎందుకు తెలియదు! తెలుసు. అందుకనే నన్ను చాలా భద్రంగా కాపాడాడు. ఇంతకీ నన్ను తన శత్రువులమీద ప్రయోగించాలనుకున్నాడు.
గుర్రం – యుద్ధంలోనేనా?
సూక్ష్మజీవి – అవును. కాని వాళ్లు ఒక్కవిషయం మరిచిపోయారు. ఏదో జ్ఞాపకంలేదు. పెద్ద లాటిన్‌భాషపేరులే! ఆపేరులో ఉన్న మాజాతివాళ్ళు ఇంకో రున్నారన్నమాటే వాళ్లకి గుర్తులేదు. అజాతి ఆడజాతి. తెలిగ్గా కొంపలు ముంచేస్తుంది. ఆఫ్రికా ఆఫ్రికా అంతటినీ నిముషాల్లో నిద్దర్లోపెట్టేసింది.
గుర్రం – మిమ్మల్ని యూరపుమీద ప్రయోగించారా?
సూక్ష్మజీవి – అవును.... పూర్తిగా కబళించేశాం! ఎంతోకాలం పట్టలా. సర్వ నాశనం అయిపోయేదాకా మేమక్కడ ఉన్నామనే ఎరగరు పాపం !
పాము – ఆలోచించిచూస్తే నిజంగా వాళ్ల అమాయకత్వానికి ఆశ్చర్యం నవ్వూ కూడా కలుగుతాయి. ప్రతీయుద్ధంలో రెండుపక్షాలవాళ్లూ "మాయంత్రాలు కొత్తవి. మావాటిని జయించేశక్తి మరిదేనికీ లేదు" అని గప్పాలు కొట్టు కుంటారు. రాక్షసత్వాన్ని ప్రకటించడంలో ఎప్పుడూ హన్కు ఒకళ్లకే

భుక్తంకాదు. ఒకళ్ళు ఒకటి కనిపెడితే రెండోవాళ్ళు దానితలదన్నేదాన్ని మరోటి కనిపెడుతున్నారు. ఇందుకు తార్కాణం మనసూక్ష్మజీవి ' జిమ్ '. 'జిమ్ ఉన్నాడు మనకేం' అని భరవాసాగా ఉంటే రెండో పక్షంవాళ్ళు అతనిజాతి ఆడవాళ్లవల్ల మోసపోయారు.

సూక్ష్మజీవి — అంతా ఓ పీడకలలా అయిపోయింది. పరిశోధనాలయాల్లో ఉన్నంతకాలం వాళ్లకి సలహాయిద్దామని నోటిచివరిదాకా "జాగర్త" అని వచ్చి ఆగిపోయేది.

ఆడసింహం — హెచ్చరించినా వాళ్ళు వినేరకంకాదు.

సూక్ష్మజీవి — అంతేకావచ్చు. నిజానికి అతిప్రేమవల్ల నేనంటే లక్ష్యం లేక పోయింది వాళ్లకి. నా మమతలోపడి దేవుణ్ణి కూడా మరిచిపోయి అలక్ష్యం చేశారు. కోట్లపరిమాణంలో ఉన్న మామేనమామల్లో ఒకాయన అన్నట్లు "అరక మూలబడితే, కత్తికి పదునెక్కుతుంది."

పాము — చిత్రంగా, ఏగందరగోళం లేకుండా, చీమ చిట్టుక్కుమనకుండా, కనురెప్పపాటులో జరిగిపోయిం దీప్రళయ మంతా!

కోతి — ఇలా అంటున్నందుకు ఏమీ అనుకోకు జిమ్; మమ్మల్ని ఏమీ చెయ్యవుగదా! ఏమో చాలా భయంగా ఉంది నిన్ను చూస్తూంటే.

సూక్ష్మజీవి — మిమ్మల్ని ఏమీ చేయను. నామాట నమ్ము కోతి బావా! నేనేం రక్తపిపాస ఉన్నవాడిని కాదు. కాకపోయినా మానవుడు ఎలా తయారు చేస్తే అలాతయారయ్యాను గాని నాకు స్వశక్తి లేదని నీకు తెలియదూ! ప్రస్తుతం మేకపిల్లలాగా మెత్తబడ్డాను.

కోతి — రక్షించావు! బతికిపోయాం!

(బిల్ మనిషివాసన పసిగట్టినట్లు వాసన చూస్తుంది.)

సింహం — ఏమిటా కంగారు బిల్?

బిల్ — (నెమ్మదిగా) దగ్గిరలోనే మనిషున్నాడు.

(పరుగెట్టడానికి సిద్ధమౌతుంది. అందరూ కంగారు పడి లేస్తారు. కోతి కిచకిచలాడుతుంది.)

సింహం — (కుక్కనిఆపి) తొందరపడ కబ్బాయి. ఒక్క నిముషం.

బిల్ — తప్పకుండా అతనే.... నన్ను వెళ్ళనీయండి.... ఒక్క క్షణంలో నాకోసం ఈలవేసితీరుతాడు.... భౌ.... భౌ.... భౌ....

పాము — (భయంతో) వాక్క.... వెర్రిగా!

సింహం – (ఆడసింహంతో) నీకళ్లు బాగా ఆనతాయి. ఎవరైనా కనుచూపు మేరలో వున్నారా?
ఆడసింహం – ఎవరూ లేరే!
గుర్రం – బిల్ కలగంటున్నాడ్రా!
పాము – వాడెప్పుడూ అంతేలే.
బిల్ – కాదు! నామాట నిజం. నమ్మండి.
సింహం – వాళ్ళెప్పుడో ఈప్రపంచంలోంచి మాయమైపోయారు.
ఆడసింహం – అందర్నీ భయపెట్టి చంపేశావు. జాగ్రత్తగా చూచి మాట్లాడక పోతే తగులుతాయి.
సూక్ష్మజీవి – బిల్ చెప్పినమాటే నిజమైతే గట్టిచిక్కే! ఇప్పటికే నావంతు బోలెడంతమంది బలిఅయ్యారు. ఇక నేను శెలవుపుచ్చుకొని విశ్రాంతి తీసుకుంటాను. ఇక ఏంచేయాల్సివచ్చినా, నీదే భారం సర్పం!
పాము – (కోతితో) చూడు కోతిబావా! ఒక్కసారి అలా అలా గెంతి నాలుగు మూలలా జాగర్తగా చూచి రా, ఎక్కడైనా మనిషిఅలికిడి వుందేమో!
కోతి – అలాగే!
బిల్ – నేనూ వస్తానుండు నీతో.
సింహం – అబ్బే! నువ్వు కదలడానికి వీల్లేదు.
ఆడసింహం – నిన్ను నమ్మడానికి వీల్లేదు. (కోతి కిచకిచమని వెళ్లిపోతుంది.)
గుర్రం – (బిల్‌తో) అసలు మనిషున్నాడని నీకెలా తెలిసింది?
బిల్ – (సంతోషంతో) మనిషిలేకుండా ప్రపంచం ఎలావుంటుంది? అతను లేడంటే నాకు నమ్మకంలేదు. (భౌ... భౌ...)
పాము – ఇంకా పాతజ్ఞాపకాలేనా? మరిచిపోవాలి బిల్.

(బిల్ వెళ్ళిపోడానికి సిద్ధపడుతుంది.)

బిల్ – ఎలా మరిచిపోను. మనిషి వున్నాడు. భౌ.... భౌ....
సింహం – అబ్బా! కొంచెం నోరుమూసుకుంతలేవూ?
ఆడసింహం – మంచీ మర్యాదా లేదా?
బిల్ – నన్నేం చెయ్యమంటారు? నేను ఆగలేను.
గుర్రం – మంచీ మర్యాదా లేదా?
బిల్ – నేను నిస్సహాయుణ్ణి.... ఆగలేను.
గుర్రం – దాన్యంచేసేబుద్ధి నీలోనేవుంది. మనిషి నువ్వు లేకుండా బతకడం

నేర్చుకున్నాడు. నువ్వూ అలానే అతను లేకుండా వుండడం నేర్చుకో.

(ఈలోగా కోతి కిచకిచలాడుతూ వస్తుంది.)

పాము — సంగతేమిటి ?

కోతి — ఒకడు కనిపించాడు.

సింహం — మనిషేనా ?

కోతి — అవును.

ఆడసింహం — అయ్యో దేముడా! ఏందారి?

బిల్ — నామాట నిజమౌతుందని నాకుతెలుసు.

(మళ్ళీ వెళ్ళడానికి ప్రయత్నిస్తుంది.)

సింహం — కూర్చో బిల్.

ఆడసింహం — ఆడదా మగాడా ?

కోతి — తారతమ్యం తెలియలా !

పాము — ఎక్కడ కనిపించాడు ?

కోతి — ఏరుదగ్గిరే ఉన్నాడు.

గుర్రం — నీకు బాగా నమ్మకమేనా అతను మనిషని.

కోతి — బాగుంది ! తప్పకుండా మనిషే. పైగా అందమైన మనిషి.

గుర్రం — ఏం చేస్తున్నాడు ?

కోతి — విశ్రాంతిగా పడుకున్నట్టున్నాడు.

పాము — (సూక్ష్మజీవితో) అయితే నీపని పూర్తి కాలేదన్నమాట.

సూక్ష్మజీవి — ఎలా మిగిలాడా అని ఆశ్చర్యంగా ఉంది. అంతా నఫా చేయమని ఆజ్ఞ.

సింహం — (సూక్ష్మజీవితో) నువ్వు మిగిల్చిన పని ఎవరో ఒకరు పూర్తి చేయడం తప్ప దిక.

(అవునని అందరూ తల లూపుతారు.)

పాము — (కోతితో) నిదరపోతున్నాడా ?

కోతి — అనుకుంటాను.

గుర్రం — భయపడ్డాడా ?

కోతి — లేదు. నేనే అతన్ని చూసి భయపడ్డాను. (వణుకుతుంది.)

పాము — బాగుంది! పైగా నేనమ్మా కోతినని తిరుగుతావా ?

సింహం — (బింకంగా) ఏముంది? ఇక చేయతగపని ఒక్కటే ఉంది.

ఆడసింహం — తప్పదా కేసరీ!

సింహం — ఏంచేయను చెలీ! తప్పదు.

బిల్ — ఈసారికి దయదల్చి వదలండి.

(వీల్లేదని అందరూ కోపంతో కేకలు పెడతారు.)

పాము — నిజానికి ఈకుక్క బొత్తిగా పనికిమాలింది!

గుర్రం — జాలి చూపతగినవాడా మనిషి?

ఆడసింహం — (నసుగుతూ) నిజం ఆలోచిస్తే దయతలంచ నఖ్ఖరలేదు. పోనీ పిల్లలుచూచి ముచ్చటపడతారు ప్రదర్శనశాలలో పెడితే!

సింహం — పిచ్చివానా! ఇతరులబాధలుచూచి ఆనందించేటంత నీచంగా పెంచలేదు మనం మనపిల్లల్ని.

పాము — మనిషి ఇతరుల కష్టాల్నిగురించి ఎప్పుడైనా ఆలోచించా డంటావా?

గుర్రం — పోనీ, మావిషయంలో ఎప్పుడైనా దయదలిచాడా?

బిల్ — ఇక ముందు బాగా ప్రవర్తిస్తానని మాటఇస్తాడేమో!

సూక్ష్మజీవి — ఎప్పుడైనా అన్నమాట నిలబెట్టుకొన్నాడా? నానాజాతి సమితిలో 'జినీవాలో' నన్ను నాశనంచేస్తానని ఇరవైసార్లు అన్నాడు. కాని ఒక్కసారైనా అలాచేశాడా?

కోతి — అన్నీ గుర్తుకువస్తున్నాయి ఇప్పుడు. నేను మళ్ళీ ఆకష్టాలు భరించలేను. ఊరూరా ఆటగాడిలా నన్ను తిప్పితిప్పి బాధలుపెట్టాడు (చాలా బాధగా) ఆబాధ మరి వద్దు. నన్ను రక్షించండి బాబోయ్!

సింహం — (ఆలోచనగా) మళ్ళీ తిరిగి వచ్చాడంటే మనందరికీ ముప్పే!

పాము — అవును ముప్పే! తన కీర్తిప్రపంచంలో ఎవరూ ఎదురులేరని తన్ని తనే సర్వనాశనం చేసుకున్నాడు. అంతేగాదు; వేరే లోకాల్లోనూ ఆధారం లేకుండా చేసుకున్నాడు.

బిల్ — ఎంత విచారకరమైన విషయం.

గుర్రం — కావామరి! చాలా విచారకరమైన పరిస్థితే!

కోతి — అనవసరంగా మనం కాలం వృథా చెయ్యకూడదు.

గుర్రం — వినండర్రా; వినండి.

కోతి — మనం మాటలాడుతూండగానే ఆమనిషి ఏదో చేసేస్తాడు.

సూక్ష్మజీవి — అవును. చాలా టక్కరి.

గుర్రం — ముఖ్యంగా ఆచేతు లున్నాయే!

అడసింహం — అయ్యో! ఆ చేతులు మనందరి మంచికీ ఉపయోగపడుంటే ఎంతబాగుండేది.

పాము — వెంటనే చంపేయాలి.... చావు తప్పదు.

(బుస కొడుతుంది.)

సింహం — ఇందుకు అందరికీ సమ్మతమేనా?

(బిల్ తప్ప అందరూ సమ్మతమేనని తల లూపుతారు.)

సూక్ష్మజీవి — (వెటకారంగా) అవును. బిల్ ఎలా ఒప్పుకుంటాడు చెప్పండి.

బిల్ — నా సలహా కొంచెం మన్నించండి.

పాము — (నిశ్చయంతో) ఒక్కరు మినహా, అంతా వప్పుకున్నారు. ఇంతకీ శిక్ష ఎవరు అమలుజరుపుతారు?

అడసింహం — సూక్ష్మజీవివల్లతప్ప ఈ పని ఎవరివల్లా కాదు.

సూక్ష్మజీవి — అబ్బే! నావల్లకా దీపని. నేను ప్రస్తుతం సెలవులో ఉన్నాను. పైగా ఇదివరకే నాపని పూర్తిజేసేశాను.

సింహం — (తీవిగా) నేనే చేస్తాను.

అడసింహం — మరీకఠినంగా ఉండవద్దు కేసరీ!

సింహం — క్షణంలో అన్నీ అయిపోతాయి చెలీ! (తీవిగా లేచి బయలుదేరి ఎడంవేపు వెళుతుంది. మిగిలినవన్నీ వెంట వెళుతాయి. కోతితో) ఎక్కడన్నాప్; ఏరుదగ్గిరా?

కోతి — అవును (సింహం వెళ్ళిపోతుంది.)

పాము — (బిల్‌తో) ఏంచేస్తాం చెప్పు బిల్. ఇది తప్పనిసరి వ్యవహారమని నీకూ తెలుసు.

కోతి — ప్రతీవాళ్ళకీ అదునువస్తుంది. ఆ అదును ఉపయోగించుకోకపోతే ఇంకోరు వినియోగించుకుంటారు.

పాము — ప్రకృతికి, ఒకవిధంగా మనిషి చాలా ఇష్టుడు. కాని, ఇష్టులు పడిపోవడం ప్రతి దర్బారులోనూ జరుగుతూ ఉంటుంది. మనిషికీ అంతే.

అడసింహం — (బయటికి చూస్తూ) కేసరి తిరిగివచ్చేస్తున్నాడు. ఏమైందో!

పాము — ఏమిటీ అన్నావు?

అడసింహం — అడిగో, ఇల్లాగే వస్తున్నాడు పరుగెత్తి.

గుర్రం — భయపడ్డాడేమో!

(ఆశ్చర్యం, భయం ముఖంమీద తాండవిస్తూ ఉంటాయి. సింహం వస్తుంది.)

ఆడసింహం — ఏమైంది ప్రియా ?
సింహం — (కోతితో) అతను మనిషేనని నీకు పూర్తిగా నమ్మకముందా ?
కోతి — కోతిమాత్రం కాదని తెలుసు. అంతే!
సింహం — నాకేదో భయంగా ఉంది.
ఆడసింహం — పోనీ సింహాల్ని ఉచ్చుల్లో పడేసేవాడు కాదుగదా!
పాము — (సూక్ష్మజీవితో చిరాగ్గా) వెళ్లు జిమ్.... వెళ్ళి ఆ పనేదో ముగించుకురా!
సూక్ష్మజీవి — (విసుగ్గా) సరే.... అల్లాగే వెళతాను.... విజ్ఞానశాస్త్రం లేకపోతే మేం ఎక్కడుండే వాళ్ళమో! (వెళుతుంది.)
గుర్రం — (తొందరగా) ఇదిగో ఇలానే వస్తున్నాడు.
బిల్ — భౌ....భౌ....భౌ...
ఆడసింహం — అబ్బా! ఒకటే గోల... కొంచెం సేపు నిశ్శబ్దంగా ఉండలేవూ ?
పాము — (ఆశ్చర్యంగా) హరి భగవంతుడా ?
ఆడసింహం — ఎవరు ?
గుర్రం — ఏమైంది ?
సూక్ష్మజీవి — లాభంలేకపోయింది. సూక్ష్మజీవికి లొంగడు. టీకాలు వేయించుకున్నాడు. నా జీవితంలో మొట్టమొదటిసారిగా అపజయం పొందాను.
దేవదూత — (నవ్వుతూ ప్రవేశిస్తాడు. ఠీవిగా పొడుగ్గా ఉంటాడు. జంతువులన్నీ అతన్ని చూసి వెనక్కి తగ్గుతాయి. చేతులు పైకెత్తి)భయపడకండి. (పాముతో) నేను జ్ఞాపకమున్నానా ?
పాము — జ్ఞాపకమున్నారు. దేవదూతకదూ మీరు.

(అన్ని వేపులనుంచీ హర్షధ్వానులు చెలరేగుతాయి.)

సింహం — క్షమించండి. మిమ్మల్ని చూసి మనిషి అనుకున్నాం.
కోతి — ఎంతపని చేసేశాం!
దేవదూత — (గంభీరంగా) మీ క్షమార్పణ అంగీకరించాను.
సూక్ష్మజీవి — ఒక్కడైనా ఎలాతప్పించుకున్నాడా అని ఆశ్చర్యపోయాను.
దేవదూత — జిమ్! నీ పని చాలా క్షుణ్ణంగా చేశావు.
సూక్ష్మజీవి —ఏమైనా నన్ను మనిషి పుట్టించాడు. అతను చేసిన అన్నిపనులకీ లోపాలున్నాయి.

దేవదూత — సత్యంచెప్పావు. నేనూ అందుకే వచ్చాను.

గుర్రం — మేము మొదలెట్టినపని పూర్తిచేయడానికా?

దేవదూత — పరిస్థితులను తెలుసుకోడానికి వార్తాహరిగా పంపారు.

బిల్ — (విచారంగా) నాగురువు మానవుడి చిహ్నం ఎక్కడా లేదా?

దేవదూత — ఇంతవరకూ ఎక్కడా కనబడలా (అందరూ సంతృప్తిగా శబ్దం చేస్తారు) ఒక గొప్ప విషాదాంతనాటకం పరిసమాప్తిఅయి తెర వాలి పోయింది.

పాము — మీకు అంతా అయిపోయిందని నమ్మకంగా ఉందా?

దేవత — అయిపోయింది. ఏమీ మిగల్లా!

సూక్ష్మజీవి — ఎందు కిలా అయిం దంటారు?

దేవత — సృష్టిలో అత్యున్నతమైన పదవి చేరవలసిన మానవుడు, తప్పు టడుగువేసి జారిపోయాడు. తుదకి నీచమైన నిన్నుకూడా తనస్వార్థం కోసం ఉపయోగించాడు, జిమ్.

సూక్ష్మజీవి — (సిగ్గుతో) అవును! చాలా ఘోరమైన పనిచేశాడు.

ఆడసింహం — (కొంచెం భయంగా) నామాట నమ్మండి! మనిషి లేకపోతేనే, మేం సుఖంగా జీవించగల్గుతున్నాం.

దేవదూత — నీమాట నిజంకావచ్చు! కాని మానవు డీవిధంగా నశించిపోవ డం నాకు చాలా విచారంగా ఉంది. భగవద్దర్శనానికి తపించే మాన వుడు తన ఆత్మనిరూపణకోసం నిర్మించిన అపురూప శిల్పకళా ఖండా లైన దేవాలయాలు మానవుడి హృదయబహిర్గతమై ఊర్ధ్వగాములైన శిల్పప్రార్థనగీతికల్లా వెలిగిపోతున్నాయి. సునిశితంగా మలచిన అతని కళాఖండాలకు కాలానికి సంకెళ్ళువేసి నిరోధించగల అపురూపశక్తి ఉంది. భూదేవి మానవుడికి సమస్తం ప్రసాదించింది. సుఖపెట్టింది. ఇం కొన్నాళ్ళు పోతే తన సుస్థిరచిహ్నాలు భూమ్మీద ముద్రించేవాడే మాన వుడు. అతని ద్రోహానికీ, ఒక విధంగా అతని కాయకష్టానికీ చిహ్నాలైన యంత్రాగారాల్ని (తలవాల్చి) ఎక్కడ చూచినా పాడుకొల్పి పోయాడు. బాధతో మానవుడికోసం ఓ వేడికన్నీటి బొట్టు రాల్చను. విషాదాంతమైన ఈగాథ తల్చుకుని నిట్టూర్చి తలవాల్చాను.

గుర్రం — అంత అజ్ఞానంగా ప్రవర్తించేదేం మానవుడు?

దేవదూత — అతడు మానవుడు గనక !

కోతి — మానవుడికి ఎందరో సలహాలిచ్చారు ?

దేవదూత — ఇచ్చినమాట వాస్తవమే ! వీళ్ళని ఉద్ధరించడానికి ఎవరు * అవతరించాడో తెలుసా ? (అన్నిజంతువులూ భక్తితో తలలు వాలుస్తాయి.) ఎందరో ప్రవక్తలూ, ఋషులూ పుట్టారు వీళ్ళకి చేయూత నిద్దామని. ఊహూ. అందరి మాటా పెడచెవిని బెట్టాడు. పైగా తూలనాడాడు చివరికి తనదుర్బలత్వానికి తానే గురైయ్యాడు.

కోతి — చాలా విచారకరమైన విషయం !

దేవత — యుద్ధంమీద యుద్ధం చేశాడు. ప్రతీ యుద్ధం అతన్ని ఇంకో మెట్టు కిందకి దిగజార్చింది. దీంతో అతని పతనానికి ఇంకా అట్టే ఆలస్యం లేదని రుజువైంది. సహజసరళయై మృదుమానసియైన స్త్రీ తనధర్మాన్ని మరిచింది. క్రౌర్యానికీ, అవినీతికీ ఆధారభూతురాలైంది. జాతికి మాతే స్త్రీ. ఆమే జాతికి చిచ్చుపెట్టింది. (అందరూ తల వంచుకుంటారు. అంతా నిశ్శబ్దం.)

కోతి — ప్రస్తుత కర్తవ్య మేమిటని శెలవు ?

సింహం — (ఆత్రంగా) వేరే ఇంకో ఉత్తమజాతి తిరిగి ఆవిర్భవించడం తప్పదా?

ఆడసింహం — మమ్మల్ని రక్షించండి. ఇంకే పరీక్షలకీ మమ్మల్ని గురిచేయకండి. మా ప్రపంచాని కికనైనా శాంతి ప్రసాదించండి.

పాము — ఎలకలు చాలా పురోగమిస్తున్నా యంటున్నారు. పోనీ వాటికి చేయూత నీయగూడదా ?

సూక్ష్మజీవి — అవును చాలా తెలివిగల జాతది !

గుర్రం — మానవుడికన్నా ఎక్కువ తెలివి గలవి.

దేవదూత — ఇంకో గొప్పజాతి భూమిమీద ఉదయించవచ్చు. కాని, మానవుడు చేసినతప్పే వాళ్ళుకూడా చేస్తే ఇక వీల్లేదు. వాళ్ళకూ అభివృద్ధి లేదు; ముక్తి లేదు.

సూక్ష్మజీవి — ఏం తప్పు చేశా డంటారు మానవుడు ?

దేవదూత — ప్రవక్తలమాట శిరసావహించలేక పోయాడు.

గుర్రం — మీరు ఆస్తికులా ?

---

* ఏసుక్రీస్తు అని అభిప్రాయం.

దేవదూత — కాదు ! నేను శాస్త్రజ్ఞుణ్ణి. మానవుడు శాస్త్రజ్ఞానంతో ఎన్నో అగాధమైన విషయాలు సాధించాడు. భూమ్మీదా, గాల్లో, నీళ్ళల్లో, భూగర్భంలో తన ప్రభావం చూపెట్టాడు చివరికి సూర్యరశ్మిని కూడా తన కోసం ఉపయోగించుకోడం నేర్చుకున్నాడు. తోటిమానవుడితో సహకరించడానికీ, సహజీవనం చేయడానికీ ఈ అద్భుతశక్తులన్నీ ప్రసాదింపబడ్డాయి మానవుడికి. ఒకానొకప్పుడు తమలో తాము యుద్ధాలు చేసినా ఫరవాలేకపోయింది. శాస్త్రజ్ఞానం విపరీతంగా పెంపొందిన ఈకాలంలో, సూక్ష్మజీవులు ప్రబలంగా ఉన్న ఈ రోజుల్లో, మానవుడు ఋషితుల్యుడై అభిగమించనైనా అభిగమించాలి లేకపోతే తనస్వార్థానికి తనే బలైనా అయిపోవాలి. రెండే మార్గాలు మిగిలాయి.

సూక్ష్మజీవి — నశించిపోవడానికే నిశ్చయించుకున్నాడు.

దేవత — మహాఋషికాదగ్గ మానవుడు, భయంతో తప్పటడుగు వేశాడు. ఈ భయంవల్ల పిరికితనం వచ్చింది. పిరికితనంవల్ల ఆత్మరక్షణకని ఆయుధాలు కనిపెట్టాడు. ఆత్రుతకొద్దీ సైన్యాలు పెంచాడు. తననీడను చూచి తానే బెదిరిపోతున్నానన్న విషయం గ్రహించలేక పోయాడు. (చిరునవ్వుతో)ఏదో మాట్లాడుకుపోతున్నా ననుకోవద్దు. మాలోకంలో అన్నీ సమగ్రంగా చర్చించుకుంటాం.

(బిల్ చెవులునిక్కబొడుచుకుని మొరుగుతుంది.)

ఆడసింహం — మళ్ళీ ఏ మొచ్చింది బిల్ ?

దేవదూత — ఏం జరిగింది బిల్ ?

సింహం — ఎవరైనా కనబడ్డారేమో !

(ఈల దూరంగా వినబడుతుంది. అందరూ ఆశ్చర్యంగా ముఖముఖాలు చూసుకుంటారు. బిల్ ఆనందంతో తోక ఆడించుకుంటూ ఒక్క పరుగులో మాయమౌతుంది.)

దేవదూత — మానవుడుచేసిన శబ్దమే అది !

కోతి — (ఎడంపక్కగా వెళ్ళివచ్చి) అయ్యో దేముడా ! అది మనిషే !

(సింహం గర్జిస్తుంది. అందరూ కోతిచుట్టూ మూగుతారు)

దేవదూత — కేసరీ ! శాంతించు.

పాము — (దేవతతో) మళ్లీ బతకనిస్తారా ?

ఆడసింహం — ఇకనైనా సుఖంగా జీవిద్దామనుకున్నాం !

దేవదూత — వచ్చినవాడిని చూడనియ్యండి.

కోతి — ఇలాగేవస్తున్నాడు.

గుర్రం — (సూక్ష్మజీవిని పులుకూ పులుకూ చూస్తూ) జిమ్! ఎంత అపకారం చేశావ్?

సూక్ష్మజీవి — ఏంజేయను! నావశం కాలేదు. తలకిమించిన పనైంది.

బిల్ — (పరుగు పరుగున వచ్చి) మంచి శుభవార్త గొప్పవార్త. (సింహం.... హు....మ్మని గర్జిస్తుంది, పాము బుసగొడుతుంది.)

దేవదూత — ఆగండి. శాంతం! (బిల్ అనే మనిషి ప్రవేశిస్తాడు. దౌర్భాగ్యపు మహాయుద్ధానికి చిహ్నమా అన్నట్టు ఉన్నాడు. కాకీ దుస్తులు వేసుకున్నాడు. మధ్యవయస్సు. ప్రయాణంవల్ల పూర్తిగా అలిసిపోయి ఉన్నాడు. బట్టలు బురదగొట్టుకు పోయాయి. వెర్రివాడిలా నాలుగు మూల్లా చూస్తూంటాడు. జంతువులన్నీ మీదపడ్డానికి సిద్ధపడతాయి. దేవదూత చేత్తో ఆపుతుంది.)

మనిషి — (భక్తితో) మీరెవరో తెలుసుకోవచ్చా?

దేవదూత — మాది దేవలోకం.

మనిషి — మీరు మాజాతివారు కారని చూడగానే గ్రహించాను. ఉత్కృష్టస్థితిలో ఉన్నప్పుడు కూడా మేం మీలా కాలేకపోయాం.... కేవలం ఒక్క మానవుడైనా దేవత్వం పొందలేకపోయాడు.... కాని జరిగిందాని కిప్పుడు బాధపడి ప్రయోజన మేముంది? .... (విచారంగా నిట్టూరుస్తాడు)

దేవదూత — ఒంటరివై పోయావు.

మనిషి — అవును ఒంటిగాణ్ణే! (జంతువులన్నీ కోపంగా ఉరుముతాయి)

దేవదూత — (చేత్తో అడ్డుచెపుతూ) చాలిక ఆగండి!

మనిషి — నాకుక్కకి తప్ప అందరికీ నామీద కోపంగా ఉంది. (కుక్కని దువ్వుతాడు.) నాకు కుక్క వక్కడే విశ్వాస పాత్రుడైన స్నేహితుడు. (వెళ్లిపోడానికి ప్రయత్నంచేస్తాడు.)

దేవదూత — ఎక్కడికి ప్రయాణం?

మనిషి — ఫలానాదిక్కుకని లేదు. ఎవరైనా సహచరులు కనబడతారేమోనని ఆశ!

దేవదూత — ఒకరైనా కనబడారా?

మనిషి — ఎంత గాలించినా కనబళ్ళేదు. తుదకి శత్రుపక్షంవాడైనా ఒక్కడు

కూడా లేదు. అంతా శూన్యమైపోయింది. (సూక్ష్మజీవి వంకచూసి) బహుశా జిమ్‌కి వాళ్లవైనం తెలియొచ్చు !

దేవదూత – అవును ! తెలిసుండవచ్చు !

మనిషి– అందర్నీ పొట్టన బెట్టుకున్న సూక్ష్మజీవి నన్నెలావదిలేశాడో చిత్రంగా ఉంది. ఏదైనా, చాలా కృతజ్ఞుణ్ణి నీకు !

దేవదూత – ఎలా బతికి బయటపడ్డావు ?

మనిషి – ఎలాచెప్పగలను ? అసలు బతికున్నానా నేను ? అందరూ బ్రతికి ఉండి నేనే చచ్చిపోయానేమో ! చావుకీ బతుక్కీ మధ్య అట్టే వ్యత్యాసం లేదు. అసలు నా జన్మస్థలం లండనుపట్టణం. జనసంఘంలో పుట్టాను. జనసంఘంలోనే పెరిగాను. యుద్ధంలో గుంపులుగుంపులగా జనాన్ని చూశాను. అందరూ చచ్చి పడిపోయారు. ఒకళ్లూ ఊసూ పలుకూ లేదు. అంతా భయంకరంగా ఉంది! (జంతువులన్నీ కోపంగా చూస్తాయి. మీద పడబోతాయి.)

దేవదూత – ఆగండి ! వెనక్కి వెళ్లండి.

మనిషి – మిత్రులారా ! నేను మీ కపకారంచేయను. నన్ను నమ్మండి.

దేవదూత – అతడు నావాడు. అతన్ని నాకు వదలండి.

మనిషి – (జంతువులతో) నమ్మండి నామాట. మీకు అపకారం చేయను. అసలు మిమ్మల్ని బాధించాలని ఎప్పుడూ అనుకోలేదు నేను. నేను సైని కుణ్ణి కావచ్చు. తుపాకీ చేతబట్టి ఉండొచ్చు. నా అధికారి చెప్పినట్టు చేయడం తప్ప నేనెవరికీ నాఅంతట నేను అపకారం చేయలేదు. నా సైనికాధికారి మాత్రం ఏం చేయగలడు ? అతడి పైఅధికారులు చెప్పి నట్టల్లా విన్నాడు. (ఒక్క బిల్ తప్ప అన్ని జంతువులు కోపంగా చూస్తూం టాయి.)

దేవదూత – వీళ్లతో కొంచెం మాట్లాడాలి. అలా ఆ చెట్టు కింద విశ్రాంతి తీసుకో బిల్ !

మనిషి – మీరేం చేయమంటే అలా చేస్తాను ! నావాళ్లని కలుసుకుందామని గంపెడాశతో వచ్చాను. స్వాగతమంటే ఇలా వుంటుందని కల్లోకూడా అనుకోలేదు. యుద్ధవిరమణగదా అనుకున్నాను. ఒక్కడే ఏకాకిగా మిగ లగా ఏర్పడ్డ ఈశాంతి ఎందుకు ? (అలానడుస్తూ, కుక్కతో)రా బిల్.... నువ్వొక్కడివే నన్ను మనసారా నమ్మావు !

(బిల్, కుక్క బిల్ ఇద్దరూ వెళ్ళిపోతారు. జంతువులన్నీ దేవత చుట్టూ మూగుతాయి)

సింహం – చూడండి ప్రభూ! మేం యీ ఆపదల నింక భరించలేం!

కోతి – మనిషి కిక ఇక్కడ స్థానం లేదు.

అందరూ – మానవు డుండడానికి వీల్లేదు.... ముమ్మాటికీ వీల్లేదు.

పాము – (కోపంగా) చంపేయాలి! తప్పదు.

దేవదూత – పాపం! అతడు నిస్సహాయుడు! ఏమి అపకారం చేస్తాడు?

గుర్రం – ఏమైనా చేయగలడు!

కోతి – యుద్ధాలవల్ల లాభాలు తినే వర్తకుడే కావచ్చు.

పాము – మారణయంత్రాల రారాజే కావచ్చు.

సింహం – యుద్ధం పురికొల్పే మతగురువేకావచ్చు.

కుక్క – కాదు.... కాదు.... నాకు నచ్చిన మా రాజు.

పాము – చంపేయాలి (బుసగొడుతుంది)

దేవత – ఆలోచించండి. అతను ఒంటిగాడు.

ఆడసింహం – అవును పాపం! ఎల్లకాలం బతికుండడుగా?

పాము – దుమ్ములున్న మనిషి, తల్లీ!*

సింహం – న్యాయం ఆలోచించండి. ఇంత పాపానికి ఒడిగట్టుకున్న అతణ్ణి రక్షించడంలో నబుబులేదు.

దేవత – మీ లోకం దృష్టితో చూస్తే అతణ్ణి రక్షించడం అన్యాయమేకావచ్చు, కాని మీరొక్కవిషయం మరిచిపోగూడదు. మీలోకం ఒక్కటేకాదు. ఇలాటి లోకాలెన్నో ఇంకా ఉన్నాయి. అలాగే మీ భావాలేగాక ఇంకా ఎన్నో పవిత్రమైన భావా లున్నాయని మాత్రం గుర్తుంచుకోండి. మానవుడు తిరిగి మిమ్మల్ని ఎప్పుడూ బాధపెట్టడు. ఆబాధ్యత నాది. తనజాతి కంతా నామ మాత్రంగా మిగిలాడు. అనాథ సైనికుడు. ఎవరో చెప్పినట్టుగా చేసే అలవాటు! అటువంటి వాళ్ళంటే స్వర్గంలో జాలిపడతాం. అతణ్ణి నాఅధీనంలో ఉంచుకుంటాను. మీజోలికి రానీయను. (పిలుస్తాడు) సైనికుడా! (సొమ్మసిల్లిపోతూ నడవలేక నడవలేకనడుస్తాడు)

మనిషి – నన్ను క్షమించండి - నన్ను గురించి మీరు బాధపడకండి. నాకు

---

*ఆదాము తనఎముకనుంచి స్త్రీని సృష్టించి, సంతానాన్ని కన లేదా, అన్న భావం.

జీవించాలనే ఆశలేదు. ఆనందం అసలేలేదు. పోట్లాడే ఓపికా నశించి పోయింది! ఈవిశాల ప్రపంచంలో నేనొంటిగాణ్ణి. ప్రేమించే ప్రియురాలూ, బిడ్డలూ లేరు. ఆనందమిచ్చే అనుయాయులు లేరు. ప్రేమించేశక్తి క్షీణించిపోయింది. చంపే శక్తి ఏనాడో అంతరించింది... చూడు కేసరీ! ఒక్కసారి నామీద దయచూపు.......నావాళ్లని త్వరలో కలుసుకునేట్టు పుణ్యం కట్టుకో! (సింహం పంజా ఎత్తుతుంది.)

దేవత – వీల్లే దలాచేయడానికి (మనిషితో) సైనికుడా నాతో రా!

మనిషి – ఎక్కడికి ?

దేవత – మన యింటికి!

మనిషి – చాల కృతజ్ఞుణ్ణి!

(దేవత మనిషి చేయిపట్టుకుని మరీ నడిపించుకు తీసుకువెళ తాడు. రెండువేపులనుంచీ జంతువు లన్నీ నిష్క్రమిస్తాయి. వాళ్లు ముందే వొక వెలుగు ప్రసరిస్తుంది. మధ్యలో ఆగిపోతుంది. మళ్ళీ ప్రసరిస్తుంది.)

ఓం శాంతి. శాంతి. శాంతి.

— స మా ప్తం —



6]

# జేన్ వాగన్

— పాత్రలు —

మార్తా
జాన్ వాగన్
లెట్టీస్ టీగ్
జేన్ వాగన్
మేరీ చైల్డ్స్

మొదటి రంగం.-

[ఒక రైతు కుటుంబం యిల్లు. మధ్యహాల్లో ఒకమూల ఉయ్యాలా, దానిపక్కనే అద్దంఅమర్చిన బల్లా ఉన్నాయి. కుంపటి దగ్గిరే పడకకుర్చీ. కిటికీలోంచి సముద్రపుటొడ్డు కనబడుతూంటుంది. కల్లోలంగా ఘోషిస్తూ సముద్రం తుఫానురాబోతూన్న చిహ్నాల్ని కనబరుస్తూంది.

నల్లబట్టలు వేసుకుని ఇంటిముందునుంచి ఎవరో వెళుతూంటారు. దూరాన్నించి విచారంగా సంగీతం వినబడుతూంటుంది. క్రమంగా ఆగి పోతుంది. ఇద్దరుఆడవాళ్ళు ఇంటిగడపదగ్గిరే నిలబడి ఉంటారు. తీసుకు పోతూన్న శవాన్ని కనుచూపుమేరవరకూ చూసి వాళ్ళు గదిలోకి తిరిగి వచ్చేస్తారు.]

మార్తా — పాపం! రాత్రికి జేన్‌కి ఏమీతోచదు!

లెట్టీస్— ఏంచేస్తాం? ఈ చిచ్చు ఆరేదికాదుగా! చాలా బాధపడుతూంది.

మార్తా — కడుపుశోకంకన్నా నరకం ఇంకేముంది?

లెట్టీస్ — ఏమోనమ్మా! దానిబాధ నాకేంనచ్చులా! చేతికందొచ్చిన పిల్ల పోయినంతగా దుఃఖపడుతుంది. బొత్తిగా ఇంత ఇదైతే ఎల్లా!

మార్తా — పొత్తిళ్ళలో పిల్ల పొత్తిళ్ళలోనే మాయమయ్యిపోవడం ఒకెత్తూ ఎదిగినవాళ్ళతో రుణంతీరిపోవడం వేరూనూ. అడ్డాలలోగుడ్డు హరించి పోతే కడుపు తరుక్కుపోతుందంటే నమ్మ.

లెట్టీస్ — నా కివేమీ తెలియవమ్మా!

మార్తా — అవును! నీకేం చెపుతావు! పుట్టినాళ్ళందరూ సుఖంగా ఉన్నారు ఆదేవుడు దయవల్ల. మాపెద్దాడు పోయినప్పుడు తెలిసింది కడుపుశోకం అంటే ఎల్లావుంటుందో! వాడు బతికుంటే మనతోపాటు కష్టాలు పడాల్సిందేగా! అల్లాగాకుండా ఆస్వర్గంలో హాయిగా ఆనందంగా ఉన్నందుకు ఇప్పుడు సంతోషిస్తున్నాను. కాని అప్పుడుమాత్రం యమచెర అనుభవించానంటే నమ్ము. ఎంతో కష్టపడి నరకబాధఅనుభవించాక భూమ్మీద పడింది శిశువు. ఆనీరసంతో సొమ్మసిల్లి నిద్రోయాను .... మెలకువ వచ్చాక ఏముంది కాళీపొత్తిళ్ళు.... నాకష్టానికి ఫలితంశూన్యం. మార్నాడు పొద్దుటే మాఅత్త చెప్పింది జరిగిందంతా. లోకం చూడకుండానే నాబిడ్డ కళ్ళుమూసాడని. కడుపారా కన్నవాడు నాక్కాకుండా పోతే నన్నెందుకు లేపారు కారని వాళ్ళందరిమీదా విసుక్కున్నాను— ఏడ్చాను; తిట్టాను.

లెట్టీస్ — వెనుకటి కొక సామెతఉందిలే "దుఃఖించేవాళ్ళకు నిద్రపట్టుతుంది మనస్సుకు ఆందోళన ఉంటే కునుకేరాదు" అని.

(మార్తా వెళ్ళి కిటికీతలుపులు బాగా తెరుస్తుంది.)

మార్తా — అమ్మయ్యా. కొంచెం హాయిగా ఉంది. ఈ మసకచీకట్లో నాకు తోచదు బాబూ!

లెట్టీస్ — బయట గాలి జోరుగా ఉందా?

మార్తా — ఇంతాకటికన్నా ఎక్కువైంది గాలిజోరు. (కిటికీ దగ్గిరనుంచివచ్చి కుంపటిదగ్గిర నిలబడుతుంది.) కొంచెం టీనీళ్ళుచేసుకుతాగి వాళ్ళువచ్చేప్పటికుంటే, రాగానే వెళ్ళి ఇళ్ళు చేరుకోవచ్చు.

(కుంపటిమీద నీళ్ళ గిన్నెతో పడేసి అక్కడే దండెంమీద ఆరేసివున్న చంటిపిల్లబట్టలు తీస్తుంది.)

మార్తా — బట్టలు తీసేస్తే దండెం ఎంతో చిన్నబోయింది. బట్టల్లోకూడా ఇంత ఇదుంది మరి.

(మార్తా రెండుకప్పులూ సాసర్లూ బల్లమీద పెడుతుంది. లెట్టీస్ లేచి నీళ్ళలో టీపొడుంవేసి దింపుతుంది.)

మార్తా — నీనల్ల పరికిణీ * జేన్‌కి సరిపోయిందా?

---

* శవాన్ని పాతిపెట్టడానికి "చర్చి" కి వెళ్ళేందుకు.

లెట్టీస్ — కొంచెం పొడుగైంది. నడిచేప్పుడు కొద్దిగా ఎత్తిపట్టుకుని నడవమని చెప్పాను.

మార్తా — (ఆత్రంగా) అన్నమాట మరిచిపోకుండా పరికిణీ జాగర్తగా ఇంటికి తెస్తే బాగుండును. మనపొరుగు లూసీ వుందే, దాని అక్కపోతే యీ పరికిణే యెరువిచ్చాను. ఆపనేదో కాస్తా అయిపోయింతరువాత లూసీ నాపరికిణీ మాటే మరిచిపోయింది. దాంతో నేల ఊడ్చేసింపంటే నమ్మి. పరికిణీకి ఖర్చదైపోతున్నందుకు మనసు చాలా కించపడు తూంది. కాని ఆమాట చెప్పడానికి నోరు పెగల్లేవంటేనమ్మి. అప్పుడు నేపడ్డ అవస్థ దైవమే యెరుగును.

లెట్టీస్ — చాలా మంచిపరికిణీ, కదా మరి.

మార్తా — రేపు పండగనాటికి అది కుట్టించి పధ్నాలుగేళ్ళు నిండుతాయి. నమ్మితావో లేవో కాని, ఊళ్ళో ఎవరింట్లో చావువచ్చినా, ఎవరో ఒకరు దాన్ని వేసుకుని వెళ్ళుతూనేఉన్నారు, ఇన్నాళ్ళూ.

(ఇద్దరూ టీ తాగుతారు. కప్పులూ సాసర్లూ కడిగేసి మళ్ళీ బల్లమీద పెట్టి వుంచుతారు.)

మార్తా — వాళ్ళు వచ్చేవేళయింది. టీ చేసి వుంచుదాం.

లెట్టీస్ — పాపం చాలా అలిసిపోయి వస్తారు. జేన్‌కి అసలే నీరసం. దానికి తగ్గట్టు ఈ దెబ్బ. ఎల్లా తట్టుకుంటుందో పాపం! అన్నిటికీ ఆ దైవమే ఉన్నాడు!

మార్తా — భారమంతా వాడిమీద వేస్తే ఆ తండ్రే చూసుకుంటా డన్నీను.

లెట్టీస్ — ఏమో నమ్మా! నాకు మాత్రం దాన్ని చూస్తే గాబరాగా ఉంది. నిన్నల్లా పక్షిలా అడిలిపోయింది. తెల్లారే పిల్లనితీసుకు వెళ్ళేముందు దాని గోల చూడాలి! బతికున్నపిల్లని అడ్డాల్లోవేసుకున్నట్టు వేసుకుంది. ఉయ్యాల్లో పడుకోబెట్టింది. మళ్ళీ తీసుకు రొమ్ముకు హత్తుకుంది. ఉయ్యాల్లో తిరిగి పడుకోబెట్టి లాలిపాటలు పాడుతూంటే నాకడుపు తరుక్కుపోయిందంటే నమ్మి.

మార్తా — నాల్గుకాలాలపాటు భూమ్మీద ఉండాల్సినవాళ్ళ నిట్టేతీసుకు పోతాడు. ఎందుకూ పనికిరాని ముసలాళ్ళనీ ముక్కాళ్ళనీ చిరాయువులుగా ఉంచుతాడు. 'వద్దు మహాప్రభో!' అన్నవాళ్ళకి పుట్టెడు సంతానం

ప్రసాదిస్తాడు. "కావాలి ఒక్కడు తండ్రీ" అంటే ఇవ్వనే ఇవ్వడా ముండాదేవుడు.

లెట్టీస్ — ఇదంతా వాడి చిద్విలాసం!

మార్తా — (నానుస్తూ) సరేగాని! ఇలాచూడు ఆ 'ఎమిలీ' పిల్లుందే రోగాల రొచ్చు. దాన్ని ఎత్తుకుపోయి, జేన్‌పిల్ల కిన్నిసూకలుపోస్తే ఆముండా దేముడి దేం పోయింది అంటా?

లెట్టీస్ — లోకంలో మనకి కావలసినట్టల్లా జరుగుతుందా పిచ్చిదానా? అలా జరిగిందో ఈ ప్రపంచం ఎంతైనా విడ్డూరంగా నడుస్తుంది.

మార్తా — మహా! ఇప్పుడు లోకం విచిత్రాలూ విడ్డూరాలూ లేనట్టు. కష్ట నిష్టూ రాలన్నీ పేదసాదలకేగా! ఈపక్షపాతం ఎవరిదంటావు? తిండికిలేక అల్లాడేవాడికి గుప్పెడుమెతుకులు కరువు. తినడానికన్నా ఇంటెడుమంది లేనివాళ్ళఇంట్లో ధనం మూల్గుతుంది. పూటకి టికానా ఉండదు. ఇంటి నిండా ఇల్లుఈనినట్టు పిల్లలూ, వాళ్ళరొదా! కడుపులో పేగుల గుడగుడా మిగులుతాయి మనబోటివారికి. దీనికి కారణం ఏమిటోచెప్పు పోనీ!

లెట్టీస్ — (నెమ్మదిగా) ఈప్రశ్నలకి సమాధానాలు నాకన్నా తెలివిగలవాళ్ళూ సమర్థులూ చెప్పదగినవి. ఉన్నదాంతో తృప్తిపడ్డంకన్నా మంచిదేముంది చెప్పు.

మార్తా — వచ్చే నాలుగుడబ్బులతో రెండు పెద్దపొట్టలూ, రెండుచిన్నపొట్టలూ నిండనప్పుడు తృప్తిమా టెక్కడే?

(మార్తా లేచి గుమ్మందగ్గిరికి వెళ్ళి చెయ్యి కళ్ళ కడ్డంపెట్టి సముద్రంవైపు చూస్తుంది.)

లెట్టీస్! ఈ ఈదరగాలి రేప్పొద్దుటి వరకూ ఇలానే ఉందంటే సముద్రంలో ఉన్న ఆఓడ ముక్క ముక్కలై పోవడం తప్పదు! పాపం! ఎంతకష్టం!

లెట్టీస్ — అందులో ఇంకా దురదృష్టవంతు లెవరూ దిగడలేదుగదా?

మార్తా — (మందహాసంతో) ఆయన భూతద్దంపెట్టి చూశాడే! అందరూ ఓడ దిగి వెళ్ళిపోయారన్నాడు. నిన్న మధ్యాహ్నం మాత్రం ఎవరో ఒకావిడ ఓడలో మిగిలిఉన్నట్టు అనుమానంగా వుందని అన్నాడు.

లెట్టీస్ — ఆడదే కనిపించిందీ?

మార్తా — అవును! పాపం ఓడ రాతికి తగిలి బద్దలై పోయేటప్పటికి ఆవిడ అందులోనే వుండిపోయిందట.

లెట్టీస్ – పాపం! కష్టాను పెళ్ళాంకాదుగవా!

మార్తా – అయితే కావచ్చు! మామూలుగా చావువస్తే తప్పదు. పగాళ్ళక యినా ఇలాటి అర్ధాంతరపుచావు రాగూడదు. అదుకునేవాడు లేకుండా చివరికి అందుకునే చెయ్యి అయినా వుండకుండా నీళ్ళల్లో మునిగి ఆ ధో లోకానికి పోయే ఈ చావుండే ఎవరికీ ప్రసాదించకునాయునా. తల్చు కుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది.

లెట్టీస్ – నీళ్ళల్లోనూ దైవం ఉన్నాడు పిచ్చిదానా?

మార్తా – (వినబడనట్టు) అబ్బా! తల్చుకుంటేనే ఇలా ఉందే..........

లెట్టీస్ – ఎక్కడచచ్చినా, ఎలాచచ్చినా ఒంటరిగా చావాల్సిందేగా! కాలం తీరిపోతే ఎవరిదారి వాళ్ళదే! వెంట ఏదీరాదు, ఎవరూరారు.

(రోడ్డుమీద ఇద్దరూ ఇంటివైపే నడిచివస్తూ కనిపించుతారు. సన్నగా నీరసంగా ఉంటుంది జేన్. పొట్టిగా ధృడంగా ఉం టాడు జాన్. అలవాటులేక జాన్ వేసుకున్న నల్లసూటు ఎబ్బె ట్టుగా కనిపిస్తుంది.

లెట్టీస్ లేచి, జేన్ కప్పుకున్న నల్లశాలువ పిన్నుతీసి సడలించి జాగ్రత్తగా తీసేస్తుంది)

లెట్టీస్ – తిరిగి వచ్చారా జేన్?

జేన్ – రాకేం జేస్తాను?వచ్చాను.నాకూ అక్కడ దొప్పెడునేలదొరికితేపోయేది.

లెట్టీస్ – చా! పిచ్చిదానా, అవేంమాటలు?

జేన్ – తప్పేముంది. ఎప్పుడో ఒకప్పుడు అందరకూ వచ్చేదేగా చావు!

మార్తా – అది నిజమే! కాని నువ్విప్పుడు అనాల్సిన మాటలేనా అవి?

జేన్ – రక్తాన్నీ మాంసాన్నీ పంచుకుపుట్టింది. అలాటి నా బిడ్డని పోగొట్టు కుని నే నింకా బతికున్నాను.

మార్తా – (జేన్ వెనక్కు వెళ్ళి తనవల్ల పరికిణీ ఏమైనా పాడైపోయిందేమోనని పరీక్షగా చూస్తుంది.) బట్ట నలక్కుండా జాగర్తగా వచ్చావు జేన్.

జేన్ – అవును. దారిపొడుగునా నీబట్ట ఎక్కడ పాడైపోతుందో అని జాగర్తగా పట్టుకు మరీ నడిచాను. ఒక్కసారి కాబోలు పరధ్యానంలోపడి మరిచి పోతే మేరీ జ్ఞాపకంచేసింది, ఇదిగో నీపరికిణీ. ఇక జాగర్త చేసుకో! (అని పక్కగదిలోకి వెళుతుంది.)

జాన్ – జేన్ని చూస్తున్నకొద్దీ గాబరాగా వుంది.

లెట్టీస్ – అవును నాకూ అదే భయంగావుంది.

జాన్ – దుఃఖానికితోడు, అక్కసూ, కోపం దాన్ని దహించేస్తున్నాయి.

మార్తా — దాన్నిప్పుడేమీ రేపెట్టక. కొన్నాళ్ళు గడిస్తే అదే మర్చిపోతుంది.

జాన్ — అదిగాదు మాట్టాడితేచాలు పిల్లబతికున్నట్టుగా పిచ్చివాన్నిలాఏదో ఎదో అంటుంది. అందుకని నాకు గుండె దడదడలాడుతుందంటేనమ్ము.

లెట్టీస్ — మన డాక్టరయ్యగారు అన్నారు........

జాన్ — (చిరాగ్గా) ఏమన్నాడు?

లెట్టీస్ — ఏమంటాడు. స్థలంమార్పు చాలా అవసర మన్నాడు.

జాన్ — స్థలంమార్పు మనలాటివాళ్ళకోసంకాదు! మనం పుట్టిన దగ్గిరనుంచీ మన్నయ్యేవరకూ కదలకుండా మెదలకుండా రాళ్ళలా ఇక్కడే పడివుండాలి. చచ్చిననాడే మనం స్థలం మారేది.

లెట్టీస్ — ఉండు జాన్! ఏంమాట లవి. ఆయన ఈమాటే అనలా, ఇంకా చాలా అన్నాడు. "స్థలం మార్చకపోతో పోనీగాని ఎవర్నైనా పిల్లని పక్కలో వెయ్యండి. అదీ మంచిపనే. మరిచి పోతుంది'' అని

జాన్ — (ముందుకంటే కొంచెం ఉత్సాహంగా) కాని పరాయిపిల్లల్ని యిది సాకుతుందంటావా?

లెట్టీస్ — ఆ అదే సాకుతుంది. సాక కేంజేస్తుందేం! పిల్లగొడవలోపడి అన్నీ అప్పుడే మరిచి పోతుంది.

జాన్ — (ఆత్రంగా) ఎవరిపిల్లైనా ఫరవాలేదంటావా?

(జేన్ మార్తా నల్లపరికిణీ మడతబెట్టి తెచ్చి యిస్తుంది.)

జేన్ — నీఉపకారం మరవను. నీకు ఎన్నడైనా నల్లశాలువకావలసివస్తే నాది ఎరువిస్తాను. మరెవరినీ అడగవద్దులే.

(ఉయ్యాల దగ్గిరికి వెళ్ళి అక్కడే కూర్చుని ఊపుతూ వెర్రిగా చూస్తూంటుంది. కళ్ళవెంట నీళ్ళుమాత్రం కారవు. దృష్టి ఎక్కడకో పోయింది.)

జాన్ — (కొంచెం గట్టికాని గోముగా) జేన్ ..... జేన్........ ఏమిటే ఆపని?

మార్తా — (చిన్నపిల్లని బుజ్జగిస్తున్నట్టుగా) చూడు జేన్.......ఏమి టిదంతా? వెర్రిదానా! ఇలాచూడు నావంక........

జాన్ — మనకీ దానికీ ఋణంతీరిపోయింది. విచారిస్తే వచ్చేదేముంది? చెప్పు ఆభగవంతుడి దయవల్ల నువ్వు దక్కేవు. నాకదే పదివేలు.

జేన్ — దయుగదూ! అంతా దేవుడిదయే! నా చిట్టితల్లితోపాటు నేనూ ఈలొకంలోంచి కళ్ళుమూసుకు పోతే బాగుండేది!

జాన్ — చూడు జేన్, నేనేపోతే ఏమయేదో ఆలోచించు.

జేన్ — (కోపంగా) అయితే ఏం ! ముఖ్యంగా నీకోసం నేనేమీ పడిచావడం లేదు.

మార్తా - (ఏవగింపుగా) జాన్, దాన్ని విసిగించక లోపలికివెళ్ళి బట్టలువిప్పు. ఈ మొగాళ్ళంతరూ వొకటే ! వట్టి అయోమయంజాతి. లోకజ్ఞానం కొంచెంకూడా వుండను.

(జాన్ పక్కగదిలోకి వెళ్ళిపోతాడు.)

లెట్టీస్ — చాలా చీకటిగావుంది బయట. కన్నుపొడుచుకున్నా కనబడ్డంలా. పైగా ఈపరగాలివొకటి. మే మిక వుంటాం జేన్!

జేన్ — కొంచెం టీ తాగరా ?

మార్తా — నువ్వు రాకముందే తీసుకున్నాం. మరి యిక వుంటాం (లేస్తూ) ఈగాలి ఎక్కువైతే సముద్రంలో ఓడ ముక్కముక్కలైపోవడమేమో తప్పదు. క్రాకంపా యిల్లుచేర్చడానికి మేం కూడా వెళ్ళాల్సి వస్తుందనుకుంటాను.

లెట్టీస్ — (చలికోటు పైన కప్పుకుని) భగవంతుడు నీబాధ కుపశమనం కలగజేయాలి. వస్తాం మరి !

మార్తా — అవసర మేదైనా వస్తే వొక్క కేక పెట్టడానికి వెనకాడక. వస్తాం, ఇక.

(మార్తా లెట్టీసు బయటికి వెళ్ళిపోతారు. జాన్ పక్కగదిలోంచి వస్తాడు.)

జాన్ — కొంచెం టీతాగు !

జేన్ — నాకొద్దు. నీకు కావాలంటే తాగు.

జాన్ — నాకేమీ తొందరలేదు. తరవాత తాగుతానులే ! (కూచుంటాడు.) బైబిలు చదువుతాను. వింటావా ?

జేన్ — నీయిష్టం !

(జాన్ పక్కగదిలోంచి బైబిలు తెస్తాడు. పుస్తకంలో ఓ భాగం తీసి వేలితో ఒకొక్కమాటా చూచుకుంటూ నెమ్మదిగా అక్షరం అక్షరం కూడబలుక్కుని మెల్లిగా చదువుతాడు.)

జాన్ — "ఆతడు మాటలాడుచుండగా వేరొకడువచ్చి — నీ కుమారులును నీ కుమార్తెలును తమ అన్న యింట భోజనముచేయుచు ద్రాక్షరసము

పానము చేయుచుండగా గొప్పసుడిగాలి అరణ్యమార్గముగావచ్చి ఆ యింటి నాలుగు మూలలను కొట్టగా అది యౌవనస్థులమీద పడి నందున వారు చనిపోయిరి; దానిని నీకు తెలియజేయుటకు నే నొక్కడనే తప్పించుకొని వచ్చియున్నా ననెను. అప్పుడు యోబు లేచి తన పైవస్త్రము చింపుకొని తలవెంట్రుకలు గొరిగించుకొని నేలమీద సాష్టాంగపడి నమస్కారముచేసి యిట్లనెను. నేను నా తల్లిగర్భములో నుండి దిగంబరినై వచ్చితిని, దిగంబరినై అక్కడికి తిరిగి వెళ్ళెదను; యెహోవా ఇచ్చెను. యెహోవా తీసికొనిపోయెను. యెహోవా నామమునకు స్తుతి కలుగునుగాక!"

జేన్ – (కోపంగా) అవు నవును. అందర్నీ తిరిగి తనదగ్గిరకి రప్పించుకుంటాడు? అంటే దీనిఅర్థం పిల్లకి నేను తగిందాన్ని కాననేగా! (చాలా ఆవేశంతో) ఆ పచ్చిఅబద్ధాలకోరుపుస్తకాన్ని దూరంగాపెట్టు. నాపిల్లని నానుంచి దూరంచేయడాని కాదేవు డెవరు? నారక్తంలో రక్తం, నాకండలో కండ పంచి తొమ్మిదినెలలు నాకడుపులో సంరక్షించుకుని భూమ్మీద పడేశానే! అలాటి నాపిల్లని నాక్కాకుండా చేశాడాదేవుడు! నావస్తువుని నానుంచి లాక్కున్నాడు.

జాన్ – (నెమ్మదిగా) పిచ్చిదానా, అలా మాట్లాడకూడదే! (బుజ్జగింపుగా) నీపిల్ల ఇక్కడకన్నా అక్కడే సుఖంగా వుందేమో యెవరికితెలుసు? (ఒక చెయ్యి టేబిలుమీద ఆనించి రెండోచేత్తో ఆకాశంవైపు చూపిస్తూ.) పోయినవాళ్ళతో మనంకూడా పోలేం! రోజులు వెళ్ళబుచ్చడం నేర్చుకోవాలి. తప్పదు!

జేన్ – చెప్పినంతతేలిక కాదు చేయడం! నీకేం పొలాల్లోకి పోయి పనిచేసుకుంటావు! రోజల్లా ఇంట్లో మగ్గిపోతూ నాతల్లిని తల్చుకుని కుళ్ళి కుళ్ళి నేను చస్తాను. అయ్యో, నాకూతురా! నువ్వులేకుండా నే నెలా బతకనేమా అమ్మా!

(అంటూ కాళీ ఉయ్యాల ఊపుతుంది.)

జాన్ – ఉయ్యాల ఊపితే పిల్ల బతికి వస్తుందా పిచ్చిదానా?

జేన్ – రాకపోతే రాకపోనియ్యి!

జాన్ – రానప్పుడు ఊరికే ఊపడం దేనికి?

జేన్ – ఏంచేయనో చెప్పు, ఊపడం మానేసి!

జాన్ — ఊరికే ఉయ్యాల వూపి వూపి వూపిరి పోగొట్టుకుంటే ప్రయోజనం ?

నామాటవిని ఆవైద్యుడయ్యా చెప్పినట్టు..... ........

జేన్ — వైద్యుడూ.........వైద్యుడికేం తెలుసు ?

జాన్ — అద్దాల్లో ఎవరిపిల్లనైనా వేసుకుంటే కొంచెం బాధ తగ్గుతుందన్నా డటే !

జేన్ — వాళ్ళపిల్లనీ, వీళ్ళపిల్లనీ పెంచుకు నాతల్లికి ద్రోహంచెయ్యమన్నావా ? అలా జరగడానికి వీల్లేదు.

జాన్ — ఆయన చెప్పిన ముక్కలు చెవినేశాను. తరువాత నీయిష్టం!

జేన్ — (ఆశగా) మనకి పిల్లనిచ్చే దెవరూ అంట.

జాన్ — పెంచడం యిష్టంలేనప్పు డాపూ సెంపుకు?

జేన్ — (లేచి నిలబడి తనలో తను అనుకుంటున్నట్టుగా) ఎవరిపిల్లయితేనేం? ఆపిల్లని నాపిల్లలాగా పెంచే ధైర్యం వుంటే ? (జాన్‌వైపుతిరిగి) అనవసరంగా నామనసులో యీ ఆలోచన ప్రవేశపెట్టావు. నాకు మనసు స్థిమితం లేకుండా పోయింది. జాన్ ! నాలోటు ఎలాగో వోలాగ తీర్చు !

జాన్ — పిచ్చిదానా నీకు నేనున్నాను గాదటే !

జేన్ — (నిర్దయగా గాకుండా. ఏదో నిజాన్ని నెమ్మదిగా అంటూన్నట్టు) నాలోటు నువ్వెప్పుడూ భర్తీచెయ్యలేవు జాన్! (రెండురొమ్ములమీదా చేతులు వేసుకుని) నాకుకావల్సింది. (ఎలాచెప్పాలో తెలియక ఒక్క క్షణం ఆగి........మళ్ళీ అందుకుని) ప్రతీక్షణం నాకోసం అల్లాడిపోతూ, నేను లేకపోతే జీవించలేకుండా, నిస్సహాయంగా నాకోసం, నావక్షంకోసం వెతుక్కుంటూ నన్ను హత్తుకుపోయేవాళ్ళు నాకు కావాల్సింది. (ఏదో వింటూన్నట్టు చెవులు నిక్కబొడుచుకుని) విన్నావా ? ఏమిటది ?

జాన్ — ఏముంది............ఈదరగాలి.

జేన్ — గాలిజోరు కాదు. గాలిని చీల్చుకు దూసుకు మరీ వినబడింది....... అదిగో ఏడుపు..........అదేగొంతుకు........అచ్చంగా అదే.

జాన్ — నాకేం వినబడ్డంలేదు.

జేన్ — తుఫాను హోరులో కూడా ఎవరిదో పసిబిడ్డ కంఠం వినబడుతుంది.

జాన్ — పిచ్చిదానిలా ఏవేవోవూహించుకుని బాధపడక.

జేన్ — ఊహకాదు............విను........అదిగో........ .. మళ్ళీ వినబడుతుంది. నా పిల్లగొంతుకే అది. నాతల్లి ఈతుఫానుకు ఝడిశి లేచి ఏడుస్తుంది. అమ్మా ఏడవకే.... ....వస్తున్నా తల్లీ........

(జేన్ లేచి బయటికి వెళ్ళబోతుంది. జాన్ లేచి ఆమె భుజం మీద చెయ్యివేసి ఆపుతాడు.)

జాన్ — ఆగు........... అంతా భ్రమతప్ప మరేంలేదు.

జేన్ — భ్రమకాదు; నిజం. స్పష్టంగా వినబడింది నాతల్లిగొంతుకు నన్ను ఆపుజేయకు. వెళ్ళనియ్యి. నాతల్లి ఏడుపు వింటుంటే నాకడుపు తరుక్కు పోతుంది.......వదులు.......నాకడ్డురాకు.

జాన్ — ఇంకెక్కడి పిల్ల ! చచ్చిపోయింది—చచ్చినవాళ్ళు ఇక ఏడ్చేదేమిటి ?

(జేన్ మాట్లాడదు. జాన్ ఆవిణ్ణి పొదివిపట్టుకుని కూర్చోబెడ తాడు. జేన్ నిస్త్రాణంగా చతికిలబడుతుంది.)

జేన్ — ఏంచెయ్యను. అన్నితెలిసే బాధపడుతున్నాను. ఆతల్లి నాకోసం ఏడు స్తున్నట్టనిపిస్తే ఆగలేక పోతున్నాను. వెర్రిగా ఎక్కడుందో, ఎలావుందో అని వెతకాలనిపిస్తుంది.

(గబుక్కున మార్తా తలుపుతీసుకుని ప్రవేశిస్తుంది. తలరేగింది. ఆయాసపడుతూంది. అలసట ముఖంమీద కనిపిస్తుంది)

మార్తా — ఓడ బద్దలై కలపంతా ఒడ్డుకు కొట్టుకువచ్చేసింది. మగాళ్ళందరూ బయలుదేరి వెళ్ళకపోతే లాభంలేదు. అందరూ బళ్ళుకట్టుకు సిద్ధమౌతు న్నారు. మనంకూడా తొందరపడకపోయామా, పొయ్యిలోకి ఒక్కపుల్ల ముక్క దొరక్కుండా పోతుంది.

జేన్ — పిల్లని పాట్టన పెట్టుకు గంటకాలా ? అప్పుడే పుల్లకీ పిడక్కీ దేవు ళ్ళాటా?

జాన్ — (చిరాగ్గా) ఎక్కడికీ కదలకపోతే రోజెల్లా గడుస్తుందీ అంట ? వచ్చేది చలికాలం, ఇంటో ఒకపుల్లముక్కైనా లేదు. పుల్లలకోసం దేవుళ్ళాడక పోతే మాత్రం పోయిన పిల్ల వస్తుందా ? పుల్లలకోసం వెళ్ళితే దాన్ని మరచిపోయినట్టేనా ?

మార్తా — నావంతు చెప్పడం అయిపోయింది. తరువాత మీయిష్టం.

జాన్ — మీ ఆయ నెక్కడున్నాడు?

మార్తా — ఏమోనయ్యా! ఏముంది. ఎప్పుడూ మామూలుగా యే వెనకాలో ఈడ్చుకుంటూ వెళుతూంటాడు. అంతా అయిపోయాక అప్పుడు చేప తాడు అక్కడికి. అదైనా వార్లో ఏకునికిపాట్లో రాకపోతేను. (మార్తా బయ టికి వెళ్ళి మళ్ళీ తలుపులోపలికి తలపెట్టి) ఇదిగో చూడయ్యా ! వారో

ఏచెట్టుకిందైనా మాపెద్దమనిషి ముసుగుతన్ని నిదర పోతుంటే బాగా ఊపి మరీ లేపకపోతివా యింట్లో పుల్లముక్క లేకుండాపోయి బాధపడి చావాల్సివస్తుందిసుమీ ! (అంటూ వెళ్ళిపోతుంది.)

జాన్ – అయితే వెళ్ళవద్దంటావా ?

జేన్ – (చిరాగ్గా) నీయిష్టమొచ్చినట్టు చేసుకో. మనసంటూ వుంటే నీకు....

జాన్ – మన సనేది మనబోటి పేదవాళ్ళకి కాదే ! ఉచితంగా దేవుడు మన కాళ్ళకాడికి పంపినదాన్ని అనుభవించకపోవడ మేమిటే !

జేన్ – దేవుడే దీన్ని నీకు ప్రసాదించాడు గదూ ?

జాన్ – కాకపోతే ఇంతకలప మరెల్లా వచ్చిందంటావు.

జేన్ – అవును పాపం ! మన చలిమంటలకి పుల్లకావాలని దేవుడు వాళ్ళ నందర్ని నీటిపాలుచేశాడు !

జాన్ – (చిరునవ్వుతో) ఇంతకీ ఈభూమ్మీద వాళ్ళకి నూకల్లేవు, వాళ్ళు పోయాక అకలపతో యెవరేం చేసుకుంటే వాళ్ళకేం కావాలి చెప్పు. మరి వెళ్ళిరానా ? (తటపటాయిస్తూ నిలబడిపోతాడు.)

జేన్ – నీ మనసెల్లా వుంటే అల్లా చెయ్యి. నేనెవర్ని యేదీ కోరేదీ లేదు; ఆజ్ఞా పించేదీ లేదు.

(జాన్ బయటికి నెమ్మదిగా నడుస్తూ గుమ్మంలో వొక్క క్షణం ఆగి జేన్ వంక చూచి వెళ్ళిపోతాడు. జేన్ చలిమంటవంకే చూస్తూ కూర్చుంటుంది. జాన్ వెళ్ళిన గుమ్మంవంకే ఒక్కసారి చూసి మళ్ళీ మంటలవైపు చూపు మళ్ళిస్తుంది.)

(ఒకగంటతరువాత జేన్ బల్లసవరిస్తూ బట్టలు ఆరేసే దణ్ణెం బోసిగా ఉందని గుర్తిస్తుంది. ఏదో జ్ఞాపకంవచ్చినట్టు వుయ్యాల వంక చూసి, పిల్లబట్టలు పెట్టిన బీరువాతీసి చంటిపిల్ల బట్టలన్నీ బయట పెడుతుంది. ఒక్కటొక్కటే మడతలు సాపుచేసి మళ్ళీ మడత పెడుతుంది. తలుపుతట్టినట్టు చప్పుడవుతుంది. లెట్టీస్ తలుపు నెమ్మదిగా తీసుకునివస్తుంది.)

లెట్టీస్ – గంటైవెళ్ళాడు మీఅయన. యింకా రానేలేదు. వంటరిగా వుంటా వని సాయంవచ్చాను.

జేన్ – (విచారంగా) రా, వచ్చి కూర్చో లెట్టీస్. ఒంటరితనం అంటావ్...... ఒంటరిబతుకు కాక ఇంకేముందీ బతుక్కి !

(ఒక్క నిముషం జేన్ వెనకనుంచి లెట్టీస్, ఆవిడ చేసేపనే చూస్తూంది. జేన్ చంటిపిల్ల బట్టలు హృదయానికి హత్తుకుం టుంది. నిట్టూర్చి పక్కనే మళ్ళీ పెడుతుంది. కుంపటిలో బొగ్గులు వేసి మళ్ళీకూచుంటుంది.)

జేన్ — (అనుమానిస్తూ) చూస్తున్నావుగా........... డ్రాయరు తీసాను. పిల్ల బట్టలు కనిపించాయి. అన్నీ నలిగిపోయి వున్నాయి.

లెట్టీస్ — అవును! మార్తా, ఎలావున్న బట్టలు అలాగే దండెంమీంచి తీసి దాచేసింది. నీకు కనబడితే మరీ బాధపడిపోతావని అల్లా చేశాం.

జేన్ — దాన్ని ఎప్పుడూ మర్చిపోలేను. నాకళ్ళల్లో మెదులుతూనే వుంటుంది. ఇంకా ఎత్తుకున్నట్టే వుంటుంది. ఎప్పుడూ దాన్ని గురించే ఆలోచిస్తూ వుంటాను.

(లెట్టీస్ హడావిడిగా లేచి బల్లదగ్గిరికి వెళుతుంది)

లెట్టీస్ — (గట్టిగా) ఇలాచూడు జేన్ ! నువ్వు ముప్పొద్దులా యిల్లా విచారిస్తే ఏం లాభం చెప్పు. పోయినవాళ్ళతో పోలేం. ఎదోవున్నవాళ్ళ సంగతి చూసుకోవాలి. (జేన్ సమాధానం చెప్పకుండా లేచి నిలబడుతుంది.) విచారిస్తూ కూచుంటే ఎలాచెప్పు. ఎలాగో మనసు రాయిచేసుకోవాలి. దానివారి అదిచూసుకుంది. ఏంజేసినా మళ్ళీరాదు. ఏదీ ఆబట్ట లిలా యియ్యి. డ్రాయరులో పడేస్తాను.

జేన్ — వద్దు. వాటినేం చెయ్యక. గాల్లో ఆరవేసి మడతబెట్టాలి. అలావుంచు (అంటూ లేచి దండెంమీద బట్టలువేసి పొయ్యోలదగ్గిరకు వచ్చికూర్చుని హఠాత్తుగా పైకి వేలుపెట్టి చూపిస్తూ.) అదిగో చూడుఅటువైపు........ఎదో వినబడుతుంది ....... ఏం వింటున్నావా ?

లెట్టీస్ — అవును వినబడింది. (తొందరగా లేచి కిటికీదగ్గిరికి వెళ్ళి.) అవిగో కొంగలు మందల మందలగా పండుకట్టి ఎక్కడికో ఎగిరిపోతున్నాయి. వాటి రొదే అది. బహుశా ఈజనాన్ని చూసి బెదిరిపోయి ఎగిరిపోతున్నా యనుకుంటాను.

జేన్ — అది కొంగల అరుపుమాత్రం కాదు. కొంగలు అలా అరవ్వు.

లెట్టీస్ — కాకపోతే అక్కడిజనం గోల గాల్లో కలిసివస్తుందేమో.

జేన్ — అబ్బే! మనుష్యుల గోలమాత్రంకాదు.

లెట్టీస్ – రా ఇలారా! త్వరగా వచ్చి చూడు. ఎదో పొద్దుకు మోసుకువస్తు న్నారు.

జేన్ – ఆ, వాళ్ళు ఏం మోసుకొస్తేనేమిలే!

లెట్టీస్ – అదిగో అల్లా చూడు. పాపం ముసలాడు బరువుతో కుంగిపోయి వూగిన లాడిపోతున్నాడు. అడుగో మార్తా మొగుడు, ఆమోసే కాస్తబరువుతో చావడులే! ఇంకెవరో ఏదో మోసుకొస్తున్నాడు ........ ఏదో తొట్టిలా వుంది. జనం చుట్టూ మూగుతున్నారు. అడుగో మాన్‌సిల్........అబ్బో! ఆచిరుగుల బొంత చొక్కా అతనే...... రా .... ఇలారా జేన్........వచ్చి చూడు ........ ఆసిగాడిలా యెలావున్నాడో!

జేన్ – నాకు చూడాలని లేదు. ఎక్కడైనా జాన్ కనబడుతున్నాడా?

లెట్టీస్ – ఊహు! ....... లేదు. కనబడ్డంలేదు. ఇంకా రాతిగుట్టమీంచి దిగ లేదేమో ........ ఇసకలో కలప మేరుపర్వతంలా గుట్టలుగుట్టలగా పడుతూంది. అడుగో జాన్ ....... చొక్కాచేతులు పైకిదోపుకున్నాడు ....... చేతులో ఏదోవుంది ........ మరి నేను వెళ్ళివస్తాను!

జేన్ – మంచిది వెళ్ళిరా! రెండునిముషాల్లో అతనూ వచ్చేస్తాడు. ఎదో దయ వుండబట్టి వంటరిగా వున్నానని వచ్చావు.

లెట్టీస్ – వస్తాను ........ జాగర్తగావుండు.

(లెట్టీస్ వెళ్ళిపోతుంది. ఇంతలో జాన్ తనకోటు కప్పి ఎదో తీసుకువస్తాడు.)

జాన్ – జేన్.......జేన్ ........ఇలాచూడు.

జేన్ – (విసుగ్గా) ఏం........ ఏంవచ్చిం దేమిటి (తలెత్తి అతని చేతిలోవున్నది చూసి ఇస్త్రీపెట్టె బల్లమీద పడేసి పరుగెత్తుకు వెళుతుంది.) ఏమిటి....... ఎవరు?

జాన్ – చాలా ఆశ్చర్యంగా వుందే, ఆములిగిపోయిన పోడలోంచి ఈ పిల్ల కొట్టుకువచ్చింది. (కొంచెం ఆగుతాడు. జేన్ మాట్లాడదు.) పిల్ల చలికి బిగుసుకు పోతుంది. త్వరగా తీసుకో జేన్........ తీసుకుని కొంచెం నిప్పులతో పొళ్ళంతా కాయి. (జేన్ పిల్లకోసం చటుక్కున చెయ్యిచాపి మళ్ళీ వెనక్కి లాక్కుంటుంది చేతులు)

జేన్ – ఎవరిపిల్లకోసమో పాటుపడ్డానికి నీకిష్టమేనా? ఒక్కసారి తీసుకున్నానంటే పిల్లని మళ్ళీ యెవరువచ్చినా తిరిగి ఈయను తెలిసిందా?

జాన్ — నీకోసమే పిల్లని తెచ్చాను. ఇదిగో అందుకో! పెంచు. దాన్ని పెంచడం నాకూ యిష్టమే!

(జేన్ పాపాయిని అందుకుని కుంపటిముందు మోకరిల్లి పిల్లకి నిప్పులతో కాపుతుంది. చూస్తూండగానే ముఖంలో అలుముకున్న విచారం మాయమై ఉత్సాహం వెల్లువుతుంది.)

జేన్ — ఇంకెవరైనా బతికి బయటపడ్డారా?

జాన్ — లేదు, ఒక్కపురుగైనా మిగల్లేదు. పిల్లమాత్రం వుయ్యాలతోపాటు కొట్టుకువచ్చింది.

జేన్ — సముద్రంలోంచి కొట్టుకు రావడం, పైగా ఊపిరితో బయటపడడం చాలా ఆశ్చర్యంకదూ! అయితే పిల్ల నాదనేవా ళ్ళెవరూ వుండరు. ఎలా దొరికింది?

జేన్ — కలప పోగుచేస్తున్నాం. ఇంతలో ఒక పెద్దకొయ్య కొట్టుకువచ్చింది. ఫిల్ దానికోసం యెప్పటినుంచో తంటాలు పడుతున్నాడు. నే నటు చూడేలేదు. ఇంతలో చచ్చినవాళ్ళంతా లేచి వచ్చినట్టు ఒక పెద్ద గావు కేక పెట్టాడు. ఏంకొంప మునిగిందో అని చూశాను. "త్వరగా రా! ఊ.... అలాచూడు ఆకొయ్యకి కట్టిన వుయ్యాల్లో ఏముందో చూడు" చూశాను. బట్టకప్పి వుంది పిల్లకి. "చంటిపిల్లల్ని ఎత్తుకోడం నాకు చేతకాదోయి పిల్ల ప్రాణాలుగట్టివి. ఎత్తుకో! తీసుకెళ్ళి మీ ఆవిడకియ్యి. నూకలుంటే అదే బతుకుతుంది" అన్నాడు. అంతే కోటువిప్పి పిల్లకి చుట్టి యిల్లా తీసుకు చక్కావచ్చాను.

(పిల్ల చిన్నిగొంతుకతో క్యారుమంటుంది.)

జేన్ — చలీ పైగా ఆకలీ! అదిగో బల్లమీద చెంబుంది. పాలానికి వెళ్ళి కొంచెం పాలు తీసుకురా త్వరగా........

జాన్ — (ఆశ్చర్యంగా) పాలంలో యిప్పుడు ఒక పిట్టకూడా వుండదు. అంతా కలప యేరుకునే గొడవలో పడున్నారు. పైగా బయట వెలుపెట్టి పొడుచుకున్నా తెలియనంత కటికి చీకటిగావుంది. పాలంలో మూరిస్ యీపాటికి గురకపెట్టి నిదురపోతూంటుంది.

జేన్ — (చిరాగ్గా) వెళ్ళి లేపు!

జాన్ — (నెమ్మదిగా పాలచెంబుతీస్తాడు) దానికి పుట్టెడు చెముడు. లేపడానికే గంట పడుతుంది.

జేన్ — ఇదిగో పిల్లని పట్టుకో. నేనే ఒక్క అడుగువేసి పాలు తెస్తాను!

జాన్ — (నెమ్మదిగా గుమ్మంవైపు నడుస్తాడు.) వెళ్ళడానికి కష్టమనికాదు, చెమిటిది, యెంతలేపినా లేవ పన్నాను అంతే!

(జాన్ వెళ్ళిపోతాడు. జేన్ పాపాయి తడిగుడ్డలు విప్పి తన పిల్ల పొడిబట్టలు వేస్తుంది. కొంచెం సేపు నిప్పులదగ్గిర కాపి గబుక్కున రొమ్ముకి హత్తుకుంటుంది. గుమ్మంతలుపు తీసుకుని మార్తా వస్తుంది.)

మార్తా — (కుంపటిదగ్గిరికి నడిచివచ్చి జేన్ వొడిలో పిల్లని తేరిపారజూసి) అయితే నిజమే నన్నమాట!

జేన్ — అవును నిజమే! ఆజలదేవత ప్రసాదం!

మార్తా — ఈ కాళరాత్రిలో, ఆనీళ్ళలోంచి ఎలా బతికి బయట పడిందో చిత్రం!

జేన్ — ఉయ్యాల్ని తెరచాపకొయ్యకి ఎవరోకట్టారు. కొయ్యతోపాటు ఇదీ కొట్టుకువచ్చింది. బట్టలన్నీ ఉప్పునీళ్ళ ముద్దలై పోయాయి. పిల్లకిమాత్రం అపాయం రాలేదు.

(మార్తా జేన్ దగ్గిర మోకరిల్లి చంటిపిల్లని తేరిపార చూస్తుంది)

మార్తా — దేవుడి దయకదా! అంతమంది పెద్దవాళ్ళని కడుపున బెట్టుకున్న సముద్రుడు కరుణించి ఈపిల్లని వదిలేశాడు. పిల్లని యేం చేస్తావు?

జేన్ — ఏంచేస్తాను? పెంచుకుంటాను.

మార్తా — ఎవరైనా వచ్చి పిల్ల మాదని అంటే?

జేన్ — (ఖచ్చితంగా) అందరూ నీళ్ళల్లో పడి మునిగి చచ్చిపోయారు. ఇకెవరూ వచ్చి పిల్ల మాదని అనరు.

మార్తా — నీళ్ళల్లో దొరికినవాళ్ళు కష్టాలు వెంట తెస్తా రంటారు. నీకు భయంగా లేదూ?

జాన్ — పసిపిల్లవల్ల వచ్చే ముప్పేముంటుంది?

మార్తా — (తలఆడిస్తూ) నాకేమీ తెలియదు. కాని అందర్నీ కడుపున బెట్టుకున్న సముద్రుడు దయలేని పెద్దరాక్షసుడు. ఆరాక్షసుడి నోటిదగ్గిరి తిండి లాక్కుంటే వూరుకుంటాడా అని. అయినా ఎందుకొచ్చిన సంత చెప్పు నీ కిది? అనవసరంగా సుఖానున్న ప్రాణాన్ని కష్టపెట్టుకోక.

జేన్ - కష్టమో సుఖమో, పిల్లను పెంచుకుంటాను. ఇక సముద్రుడి కోపతాపాలతో నాకు నిమిత్తంలేదు.

రెండవరంగం

(కాలం - కొన్ని నెలలు గడిచింతరువాత.)

(రంగం - ఇదివరకటి యిల్లే. జేన్ వుత్సాహంగా కనబడుతుంది. ఉయ్యాల కాలితో వూపుతో వూలుబనీను అల్లుతూ వుంటుంది. ఇంతలో సామాన్యమైన బట్టలు వేసుకున్న వొకవ్యక్తి లోపలికి వస్తుంది. నవ్వు ముఖం. పల్లెటూరివాటం.)

మేరీ - జాన్‌వేగన్ యిల్లేనా యిది?

జేన్ — అవును. (లేవబోతుంది)

మేరీ - (లోపలికివచ్చి) లేవకు. నేనే వచ్చి కూర్చుంటాను. (అని లోపల కూచుని జేన్ వంక చూస్తూ) నే నెవరో నీకు తెలియ దనుకుంటాను.

జేన్ - (పరీక్షగాచూసి) అవును నాకు తెలియదు. నీదీ ప్రాంతం కాదనుకుంటాను.

మేరీ - అవును మాది అద్దరి.

జేన్ — ఏరుదాటి నేనెప్పుడూ ఆపక్కకి రాలేదు. అక్కడ చూడాల్సిన వూళ్ళు చాలా వున్నాయా?

మేరీ — నేనూ యెప్పుడూ యిద్దరికి రాలేదు. నాపేరు మేరీ చైల్డ్సు అంటారు. (జేన్ ఆపేరు విన్నట్టు కూడా ముఖంలో మార్పు చూపించదు.) నాపేరు మీఆయన ఎప్పుడూ చెప్పలా?

జేన్ — (ఆలోచనగా) ఊహూ! . . లేదు........ ఎప్పుడూ నీపేరు విన్నట్టు కూడా లేదు. కాని సారా చైల్డ్సూ మా ఆయనా కలిసి పొలంలో పనిచేసే వాళ్ళు. చాలాకాలం అవిణ్ణి చేసుకుందామనుకున్నాడట. ఆవిడ నీ కేమౌతుంది?

మేరీ — (విసుగ్గా) ఏమీ తెలియనట్టు మాట్లాడక. నీ కేమీ తెలియదా? (మేరీ మధ్యలో ఆగుతుంది.) పిల్లని చూద్దామని వచ్చాను.

జేన్ — (ఉత్సాహంగా) ఆమాట ముందే చెప్పకపోయావా. ఎక్కడెక్కడి నుంచో పిల్లని చూడాలని జనం వస్తూ పోతూ వుంటారు. కాని నీలా ఏటవతలనుంచి ఎవరూ రాలేదు.

మేరీ - పిల్లని చూడ్డానికి అంత వింతగా జనం ఎందుకు వస్తున్నారు ?
జేన్ - ఏమో చెప్పలేను. పెద్ద తుపాను. పైగా సముద్రంలోంచి కొట్టుకు వచ్చి కూడా బతికి బయటపడ్డమే ఈవింతకి కారణం కావచ్చు.
మేరీ – (ఆశ్చర్యంగా జేన్‌వంక చూసి వుయ్యాలదగ్గిరికి వెళ్ళి పిల్లని తదేక దీక్షగా పరీక్షించి ) అచ్చంగా తండ్రిపోలికే!
జేన్ – తండ్రిపోలికని నిశ్చయంగా చెప్పడానికెల్లా వీలమ్మా! మాకు పుట్టిన పిల్లకాదుగా ?
మేరీ – నీకు పుట్టింది కాకపోవచ్చు, కాని నీమొగుడిది మాత్రం అవును.
జేన్ - (అమాయకంగా) ఎవరిపిల్లో ఏమో చెప్పలేం. పిల్ల చాలా విచిత్రంగా దొరికింది. కన్నూ మిన్నూ గానని కటిక చీకటి. తుఫాను గాలి హోరు. సముద్రంలో వేఢ మునిగిపోయింది. అందులోంచి పిల్ల కొట్టుకువచ్చింది. అంతా ఆదేవుడి దయ. ఆరోజే మాపిల్ల మాకు కాకుండా పోయింది. వెంటనే దాని బదులా అన్నట్టు యిది దొరికింది. జాన్ నామాట పుచ్చుకునే పెంచమని యిచ్చాడు.
మేరీ – (ఆశ్చర్యంగా హా! అంటుంది) బాగుందమ్మా. కథ చాలా బాగుంది. మంచికథే అల్లాడే నీమొగుడు! ఎంతకన్నాతగును. ఇంతకీ నీమొగుడు చెప్పిం దంతా నమ్మానంటావా అమాయకంగా ?
జేన్ – నమ్మకుండాపోవడాని కిందులో ఏముంది ?
మేరీ - నీకు తెలిసి వుండాల్సింది.
జేన్ - ఏమిటీ తెలియడం ?
మేరీ – ఇంకేముంది. ఆపిల్ల అతని కూతురని !
జేన్ – (నిశ్చేష్టురాలై) అతని కూతురా ?
మేరీ – ఏం ? ఎందుకు కాకూడదు ? న్యాయం కూడా అంతేమరి – నువ్వే అడ్డం రాక పోతే జాన్ ఈ పిల్లతల్లిని తప్పకుండా పెళ్ళాడేవాడే !
జేన్ – (విభ్రాంతురాలై లేచి నిలబడుతుంది.) ఏమిటీ అంటున్నావ్ ?
మేరీ – అనడాని కేముంది, నాచెల్లెలు సారాని గురించే ఏమన్నా! నువ్వు మధ్యలో రాకపోతే నాచెల్లెలు జాన్ పెళ్ళాం కావల్సింది. (ఊయ్యాలవంక చూపిస్తూ) ఈపిల్ల వాళ్ళ కూతురు అని నలుగురికీ తెలిసేది.
జేన్ - ఏమిటీ అంటున్నావ్ ?
మేరీ – ఏమీ ఎరగనట్టు అలా చూడ బోక. (కొంచెం జాలిగొంతుకుతో)నాకు

నిజంగా బాధగా వుందంటే నమ్ము. నీ కీ విషయాలన్నీ తెలియకుండా వుంచాడు మీఆయన అంటే నేను నోరు విప్పేవాన్నికాదు. అసలు పేచీ అంతా సారా వల్లే వచ్చింది. అది పిల్లని తిరిగి తన కిచ్చేయమని పట్టు బడుతుంది.

జేన్ – (కోపంగా) మేరీ! నీ అబద్ధాల పురాణం వేరేచోట విప్పు. ఇక్కడ కాదు.

మేరీ – (నెమ్మదిగా) నామాటలకి సాక్ష్యం పైనున్న ఆదేవుడే! నేను నిజం చెపుతున్నాను. నమ్ము! సారా తన పిల్లని నాదగ్గిర వొదిలిపెట్టి పనికి వెళ్ళిపోయింది. పిల్లకి అయ్యే ఖర్చంతా ప్రతీనెలా నీమొగుడు పంపుతా నని మాట యిచ్చాడు. కాని ఒక్కనాడూ ఎర్రని ఏగాని పంపిన పాపాన్ని పోలే దతను. ఇన్నాళ్ళూ సారాయే ఎలాగో బండి యీడ్చింది. ఇదిగో పంపుతున్నా అదిగో పంపుతున్నాను డబ్బు, అని కబుర్లే గాని జాన్ ఒక్క నాడూ అన్నమాట నిలబెట్టుకోలేదు. చివరికి విసుగొచ్చింది. మీఆయనకి కబురుపంపాను. "నువ్వు అన్నమాట ప్రకారం ఈయవల్సిన డబ్బు ఈయకపోతే మీఆవిడదగ్గిరికి వచ్చి వసూలుచేస్తాను." అని అన్నాను. ఆరోజు రాత్రే జాన్ నాదగ్గిరికి వచ్చాడు. నీ పిల్లపోయిందనీ నువ్వు బెంగ పెట్టుకు పోయావనీ చెప్పాడు. పిల్ల తనదని సారా యెప్పటికీ గొడవపెట్ట నని మాటయిస్తే పిల్లని పెంచుకోడానికి నువ్వు సిద్ధంగా వున్నావని చెప్పాడు. ఈలాటి పరిస్థితుల్లో చేయతగ్గపని ఒకటే మిగిలింది. పిల్లని నీకిచ్చివేయడమే వుత్తమ మనిపించింది. పిల్లని నేను పెంచే పరిస్థితుల్లో లేను. పసిదాని గుడ్డలన్నీ మూట గట్టి దాని వస్తువు లన్నీ భద్రం చేసి మీ ఆయనకి ఒప్పజెప్పాను. ఇప్పుడు మళ్ళీ సారా గొడవపెట్టింది. లేక పోతే నీదగ్గిరికి వచ్చేదాన్నే కాదు. నేను చేసిన దానికి సారాకు కోపం వచ్చింది. కాని పిల్లమీద అంతగా మమకారం ఉన్నట్టు ఏనాడూ నాకు తోచలేదు. ఇప్పుడు కావాలంటున్నది, మరి.

జేన్ – మేరీ, చాలా నమ్మించేట్టు అల్లావు కథని – వుండవే చెప్తాను పిల్ల మాకెలా దొరికిందో. ఊరు ఊరంతా దీనికి సాక్ష్యం వున్నారు. పిల్ల నీళ్ళల్లో కొట్టుకురావడం అందరూ చూసారు. "ఊయ్యాలతోపాటు కొట్టు కొచ్చింది. దేవుడి దయ కింతకన్న యేం కావాలని" మా అయ్యవారూ, పూజారిగారూ కూడా పూ నమ్మదిగా చెప్పారు.

మేరీ – నువ్వు చెప్పే దేమిటి జేన్? ఈ చేతుల్తో యెత్తి పెంచిన పిల్లని నేను యెరగననా నువ్వు చెప్పేది? నీమొగు డెన్ని అభూత కల్పనలు చేసి వింత కథలల్లినా ఆపిల్ల మాత్రం ముమ్మాటికీ సారాదే!

జేన్ - (కోపంగా) దగాకోరా! పచ్చి అబద్ధాలు మాట్టాడకు. నాయింట్లో వొక్క క్షణం వుండొద్దు. వెళ్ళు అవతలకి ముందు.

మేరీ – (నెమ్మదిగా) జేన్, వూరికే తొందర పడబోక. మీ అయన వచ్చేదాకా యిక్కడనుంచి కదలదల్చుకోలేదు. అతను రాగానే నిజం యెవరిదో నీకేతెలుస్తుంది. తొందరలేదు.

(జేన్ మొట్టమొదటిసారిగా భయపడుతుంది. కూచున్నా దగ్గిరనించి లేచివెళ్ళి పిల్ల బట్టలన్నీ మేరీముందు పరుస్తుంది. అవి అందమైనవీ, విలువైనవీ కూడా)

జేన్ – సముద్రంనీళ్ళలో నాని నాని వుప్పుపట్టిన పిల్లబట్ట లివిగో! కళ్ళతో చూసే దానికన్నా నిజాని కింకేం తార్కాణం కావాలి? పిల్ల తడిబట్టలు విప్పి వుతికి ఆరబెట్టాను. దాచాను. (మేరీ ఆబట్టలు చేతిలోకి తీసుకుని పరీక్షగా చూసి ఆశ్చర్యపోతుంది. బట్టలు మళ్ళీ బల్లమీద పెట్టేసి జేన్ ముఖం వైపు భయంగా చూస్తుంది.)

మేరీ – (భయంగా వొణుకుతూ.) ఈ పిల్ల మీకు సముద్రంలో దొరికిందా? అయితే ఆరోజు రాత్రి నేను చెప్పజెప్పిన సారా కూతు రేమైనట్టు? (ఎదో ఆలోచన తట్టినట్టు తొందరగా) ఏదీ ఆపిల్లనిలా యియ్యి?

జేన్ – (ఉయ్యాల కడ్డంగా నిలబడి) నాపిల్ల వొంటిమీద చెయ్యి పడిందంటే మాట దక్కదు జాగర్త!

మేరీ – సరే అల్లాఅయితే! నీమొగుడు వచ్చాకే ఆదేంటో తేలుస్తాను. మాపిల్ల నేంజేశాడో మర్యాదగా చెప్పకపోతే అప్పుడే పోలీసు స్టేషనుకు తీసుకువెళ తాను. అన్నీ అక్కడే తేలుతాయి.

(మేరీ కూచుంటుంది. రెండునిముషాల్లో తలుపుతోసుకుని జాన్ ప్రవేసిస్తాడు. అతనికి మేరీ కనబడదు. తలుపు అడ్డం వుంటుంది)

జాన్ – గొర్రెలమందకి తెగులు సోకింది. అందుకని గొర్రెపిల్లలకి కాపలా వుండమన్నాడు కామందు. "గొర్రెకాడివాళ్ళతో నువ్వూ భోంచేసి పోదువు

గాని ” అంది కామందు పెళ్ళాం. రాత్రికి నాకు బువ్వ అక్కరలేదు. తెలిసిందా ?

జేన్ – (వేలు ఉయ్యాలవంక చూపిస్తూ) నిజంగా సముద్రంలోనే దొరికిందా ?

జాన్ – ఏమొచ్చిందే యిప్పుడు. సముద్రంలో దొరక్క మరెక్కడనుంచి వచ్చిందే !

జేన్ - (మేరీవంక తిరిగి) ఇప్పుడైనా నమ్ముతావా ? (గుమ్మం వైపు చూపిస్తూ) ఊఁ.......యింక నడువు బయటికి.

మేరీ – ఆగు. నామాటకి సమాధానం చెప్పాల్సింది నీ మొగుడు. ఆరోజు రాత్రి నీచేతుల్లో పెట్టిన సారా కూతు రేమైనట్టు ? (జాన్ మేరీని కొట్టడానికి చెయ్యి ఎత్తుతాడు) దింపు చెయ్యి. నీకు జడిసేవాళ్ళెవళ్ళూ లేరిక్కడ.

జాన్ –. తగుదునమ్మా యని వచ్చావా. మొగుడూ పెళ్ళాలమధ్య తంపులు పెట్టడానికే వచ్చావా ? ఇదేనా నీ మాట నిలబెట్టుకోవడం ?

మేరీ - తంపులు పెట్టడానికే వస్తే నువ్వు వచ్చేవరకూ నడుం వాలేదాకా యెందుకు కూర్చుంటాను? నీ పెళ్ళాన్ని మభ్యపెట్టి యిన్నాళ్ళూ పిల్ల ఎవరిదో తెలియకుండా ఉంచావని అనుకోలేదు. నిజం చెప్పడానికి నీకు దమ్ములు లేవని నాకు తెలియదా ?

జాన్ – నాకా భయం ? ........ నాకు భయమని ఎవరన్నారు?

మేరీ – ఎవరనాలి? నేనే అంటున్నాను. ఇప్పటి వున్నట్టు చెప్ప గుండె దిటవు లేకపోబట్టేగా పిల్ల సముద్రంలో దొరికిందని అల్లిబిల్లి కబుర్లు చెప్పి నమ్మించావు !

జాన్ – (రోషంగా) నామాటల్లో అబద్ధంలేదు. ఉయ్యాల సముద్రంలోంచే కొట్టుకువచ్చింది. నేను........

మేరీ - (పిల్లవంక వేలుచూపుతూ) అయితే సారాకూతు రేమైనట్టు? (కొంచెం నెమ్మదిగా) నిజం చెప్పు జాన్.

జాన్ - నేను నిజమే చెపుతున్నాను. సారా పిల్ల సంగతి నాకేం తెలియదు. మునిగిపోయిన ఓడలోంచే ఉయ్యాల కొట్టుకువచ్చింది. ఊరంతా దీనికి సాక్ష్యం వున్నారు.

మేరీ – అయ్యో రాతా ! నాముఖం చూసి చెపుతున్నావా నువ్వీ అబద్ధాలన్నీ ! దేవు డెంత సత్యమో నువ్వంత దగాకోరువి, మోసగాడివిను.

సారాపిల్లే యీపిల్లకాకపోతే సారాపిల్ల నేంజేశావయ్యా! పోలీసులదగ్గరికి వెళ్ళినప్పుడే తెలుస్తుందిలే నిజం! (తలుపుదగ్గిరికి వెళుతుంది.) మంచిది, ఒక్కటే వొక్కమాట అడుగుతున్నాను. ఈ పిల్ల నీకూతురని వొప్పుకుం టావా, లేకపోతే పోలీసులదగ్గిరికి నడవమంటావా.

జాన్ – (చాలా చిరాకూ, కోపంతో) రా! వచ్చికూచో! పిచ్చిదానిలా మాట్లా డకు. (మేరీవైపు బాధా అమాయకత్వం వుట్టిపడేలా చూస్తూ.) ఆలో చించు బాగా! ఇందులో నాతప్పుకన్నా నీదే-యెక్కువవుంది. ప్రతీక్షణం "నీసంగతి జేన్‌కి చెప్పేస్తాను చూడు" అని నన్ను బెదిరించి, బెదిరించి ప్రాణాలు కొరుక్కుతిన్నావు. జేన్ కివిషయం యెల్లా చెప్పనా అని సతమత మౌతున్నాను. ఇంతలో తుఫాను రావడం వోడములిగిపోవడం సంభవించినట్టు మార్తా పరుగున వచ్చి చెప్పింది. కలపకోసం నేనూ అందరితోపాటు సముద్రపుటొడ్డుకి వెళ్ళాను. అక్కడ అడుగు పెట్టానో లేదో వోడకొయ్యకి కట్టిన ఉయ్యాలతోపాటు పెద్ద కొయ్య కొట్టుకువచ్చింది. ఫిల్ వుయ్యాల్లో పిల్లని ముందుచూశాడు. పిల్లని నాకు అందిస్తూనే అన్నాడు "చూడు, నీపెళ్ళాం పిల్లలకోసం తపించి పోతుంది. దానికి తీసుకెళ్ళి యియ్యి. పెంచుకుంటుంది" పిల్లని అందుకున్నాను. అప్పటికే చచ్చిపోయి కొయ్య అయిపోయిందని గ్రహించేశాను. కాని పిల్లలకోసం ఏడ్చే జేన్ గుర్తుకువచ్చింది. ఒక ఆలోచన మెరుపులా తట్టింది. దాని దుఃఖం యెల్లా అయినా పోగొట్టాలని నిశ్చయించుకున్నాను. తల్లికి అక్కర లేని సారాపిల్లని తెచ్చి పెంచుకోడానికి మంచి వీలు చిక్కిందని సంతో షించాను. అందరూ ఇళ్ళకి వెళ్ళి పోయేదాకా ఆగాను. చచ్చిపోయిన పిల్ల బట్టలన్నీ తీశాను. పిల్లని గొయ్యితీసి గోతులో పెట్టేశాను.

మేరీ – చెప్పడానికైనా సిగ్గులేదు. పైగా చచ్చిన పిల్లబట్టలుతీసి మరీ పాతి పెట్టానని చెపుతున్నావా?

జాన్ – పోయినవాళ్ళకి వొంటిమీద బట్టలున్నా లేకపోయినా వొక్కటే!

మేరీ – పచ్చని మొక్కైనా మొలవనిచోటున, సముద్రపు వుప్పునీళ్ళు ప్రవ హించేచోటున సమాధిచేశావా? సముద్రపు పిట్టల అరుపులు తప్ప మరేం వినబడవు దానికి.

జాన్ – పిల్లని రాళ్ళదిబ్బలదగ్గిర పాతిపెట్టి తీసినబట్టలు వుచ్చుకుని తిన్నగా నీయింటికి వచ్చాను యేరుదాటి. పిల్లను నీదగ్గిర తీసుకున్నాను. దాని

బట్టలు తీసి ఎట్లో పారేశాను. చచ్చినపిల్లబట్టలు దీనికి తొడిగాను. మధ్యలో పీడలా నువ్వు అడ్డుతగలకపోతే రోజులు హాయిగా గడిచిపోయేవి. నువ్వు వట్టి మోనకత్తెవి, దగుల్బాజీవి!

మేరీ — నీకు అంత కోపంగా వుండి తిట్టాలని వుంటే సారాని దుమ్మెత్తు. నన్ను కాదు. "నాపిల్లని నాకు తెచ్చి యిప్పజెప్పు" అని అది నాప్రాణాలు తియ్యకపోతే నే నిప్పుడు యిక్కడ అడుగు పెట్టేదాన్నే కాదు తెలిసిందా? (ఉయ్యాలదగ్గిరికి వెళ్ళి) దేవుడి దయవల్ల పిల్ల యిక్కడ సుఖంగా వున్నందుకు చాలా సంతోషంగా వుందినాకు. జేన్...........ఇదిగో ఇలాచూడు. నువ్వు ఈవిషయా లేవీ అట్టే మనసులో పెట్టుకుని బాధపడక. కష్టాలు రావడం ఒకయెత్తూ దాన్ని తలుచుకు తలుచుకు మనసులో బాధపడ్డం మరొకయెత్తూ. ఇది మరీకష్టం. (మేరీ ఒక్కక్షణం ఆగుతుంది. జేన్ మాట్లాడదు) జేన్! నువ్వు చిన్నపిల్లవి కావు. మగాళ్ళ స్వభావాలు నీకూ తెలుసు. ఏదో మనమే చూసీ చూడనట్టు వూరుకోవాలి గాని అల్లరి పెట్టుకుంటే కలిసి వచ్చే దేమీ వుండదు.

జేన్ — మా గొడవలు నీ కనవసరం - అవన్నీ నేనూ అతనూ చూసుకుంటాం!

మేరీ — (నవ్వుతూ చమత్కారంగా) అవు నవును. ఇలాటి విషయాలు మీరూ మీరూ చూసుకోవాల్సినవే. (లేచి తలుపుదగ్గిరికి వెళుతుంది.)

జేన్ — వెళ్ళేముందు ఒక్కమాట విని మరీవెళ్ళు.......నాబొందిలో ప్రాణం వుండగా మట్టుకు పిల్లని నాదగ్గిరనుంచి యెవరూ తీసుకువెళ్ళలేరు. ఆఖరికి దేవుడు వచ్చినా సరే, తెల్సిందా?

మేరీ — "అయిందేదో అయిపోయింది, యిక నోరుమూసుకుని వూరుకో" మని సారాకి చెపుతాను. అదికూడా ఏదో అందిగాని, ఒంటరిగా బతికే అడదది. దానికి నిజంగా పిల్లగొడవెందుకు? పిల్లని తీసుకుమాత్రం ఏం జేసుకుంటుందది? (జేన్‌వంక తిరిగి) వుంటాను మరి. దీనికోసం మీరిద్దరూ గొడవలు పెంచు కోకండి. (వెళ్ళిపోతుంది)

జాన్ — జేన్.......జేన్........ మాట్లాడవా? మాట్లాడు జేన్ ....... ఏదోఒకటి అను........ఏమన్నా ఫరవాలేదు........జేన్...........

జేన్ — (నిస్పృహతో) అనడానికేముందీ?

జాన్ — నన్ను పరాయివాడిలా అల్లా చూడకు. నే నది భరించలేను ........ నాకు దూరంగాకు జేన్.

జేన్ — ఈరోజుతో నీకూ నాకూ రుణం తీరిపోయింది.

జాన్ — పిల్లని పాడుచేస్తావా ?

జేన్ — లేదు. దాన్ని పాడుచేయను. దాన్ని మాత్రం యెవ్వరూ నాదగ్గిరనుంచి లాక్కోలేరు. కాని నువ్వు మాత్రం నాకు దూరమైపోయావు.

జాన్ — తొందరపడకు జేన్.........శాంతించు

జేన్ — ఇందులో తొందరపడడాని కేముంది ?

జాన్ — నిన్ను మనసారా కోరాను. నిన్ను కోరినట్టు మరెవర్నీ కోరలేదంటే నమ్ము. అంత నిర్దయగా మాట్టాడకు.

జేన్ — నీమొగమెచ్చు మాట లిక చాలు !

జాన్ — దైవసాక్షిగా నిజంగాచెపుతున్నాను. నమ్ము నామాట. సారా నేనూ ఒకే చోట ఒకే కామందు దగ్గిర కలిసి పనిచేసేవాళ్ళం. సారా మామ పోగానే ఆ అస్తి అంతా సారాకే వస్తుం దన్నారు. దీని మూలంగా నాస్నేహం సారాతో కొంచెం యెక్కువైంది. కాని నిన్ను యేరోజు చూశానో అప్పటినుంచీ మారిపోయానంటే నమ్ము — ముఖాలు తేడాయే గాని ఆడాళ్ళంచరూ ఒక్కటే అనుకున్నాను. అది నిజం గాదని నీముఖం చూశాక తెలుసుకున్నాను. నిన్ను చూశాక మంత్రముగ్ధుడిలా అయిపోయాను. దాన్ని, సారాని చేసుకునుంటే నాపనులకి చాలా వీలుగా వుండేదే ! దాని మేనమామ కూడా దాన్ని చేసుకోడానికీ అయన పొలంలోనే వుండడానికీ కూడా ఒప్పుకున్నాడు. కాని నీకోస మివన్నీ కాళ్ళతన్నుకున్నాను. నామాట నమ్మలేవా ! నీకు నామీద కొంచెంకూడా జాల్లేదా ?

జేన్ — సారాకన్నా నేను నీకు యెక్కువ అవసరమైనందుకు నేను కృతజ్ఞురాలిగా వుండాలా ? ఇంతకీ మాట లనవసరం. నీకూ నాకూ ఈరోజునుంచి యేమీ సంబంధం లేదు. పెళ్ళిగాకముందు యెల్లా పనీ పాటా చేసుకుంటూ రోజులు వెళ్ళబుచ్చుకునేదాన్నో యిప్పుడూ అల్లాగే రోజులు గడుపుకుంటాను.

జాన్ — జేన్.......నేను నీవాణ్ణి ....అలా అని నాగుండెలు బద్దలుచెయ్యక (దగ్గిరిగా వస్తాడు)

జేన్ — అలా దూరంగా వుండు. ఈరోజు మొదలు నేను నీదాన్ని గాదు, నువ్వు నావాడివికాదు.

జాన్ — మన సంబంధం అంత తేలికగా విడిపోయేది కాదు. పెండ్లి చేసుకున్నాంగామరి.

జేన్ — ఆబంధాన్ని తెంచేశేమార్గాలు చాలా వున్నాయి.

జాన్ — అల్లాటి మార్గాలూ దార్లూ మనబోటివాళ్ళకి కాదు. ధనధాన్యాలతో మూల్గేవాళ్ళకవన్నీ చెల్లుతాయి. మనలాటి పేద దంపతులు కష్టాలూ సుఖాలూ కలిసి పంచుకోక తప్పదు. వాళ్ళు కావాలంటే వేరే వేరే యిళ్ళల్లో వుండగలరు. వున్నా చెల్లుతుంది. పైగా పిల్లసంగతి కూడా ఆలోచించాలిగా. (నెమ్మదిగా గొంతులో వింత మార్పు చూపుతూ) పోనీ, సారాపిల్లని దానికే యిచ్చేస్తావా ?

జేన్ — పిల్లని చేరదీసిననాడే చెప్పాను నీకు - పిల్లని మళ్ళీ యెవరు అడిగినా యియ్యనని. ఎవరూ తీసుకోడానికి వీల్లేదు.

జాన్ — సరే, అలాఅయితే ! పిల్లే కావాలంటే మనిద్దరం కలిసి వుండడం తప్పదు. నన్ను వదిలిపెట్టి వెళతావంటే నామనసు నీరైపోతుంది. నన్ను నీకు దూరంచేయక, జేన్! (అని మళ్ళీ దగ్గిరికి వస్తాడు.)

జేన్ — రాకు........ నాదగ్గిరికి రాకు.

జాన్ — (చిరాగ్గా) అందరు మగాళ్ళూ చేసే పనే నేనూ చేశాను. పరిస్థితు లలాటివి. ఇంత రభస చేయడాని కందరకన్నా నేను చేసిన యెక్కువ తప్పేమిటో చెప్పు ?

జేన్ — అవును ! నువ్వు చేసిన తప్పేముంది ? ఊరందరిలో నాబతుకు నవ్వులపాలు చేయడం తప్పు ! లేచినదగ్గిరనించీ పడుకోబోయేవరకూ యేనిమిషాన్ని పిల్లని నాకుకాకుండా అదిచేస్తుందో అని బతికున్న న్నాళ్ళూ దిగులుపడి ఏడ్చేలాగా చేశావు! దైవముఖంచూసి అంటున్నాను. వెళ్ళు దూరంగా. నీముఖం నాకెప్పుడూ కనబడనీయక............

జాన్ — ఈమాటలన్నీ బాగా ఆలోచించే అంటున్నావా ?

జేన్ — అవును, బాగా ఆలోచించుకునే అంటున్నాను. రాత్రిలోగా ఈయిల్లు ఖాళీచేస్తాను.

జాన్ — జేన్! నీ వేమంటున్నావో నీకే తెలియదు. కొన్నాళ్ళుపోతే నీకే అర్థమౌతుంది అంతా. మరి నేను వెళ్ళనా (అని చలికోటు తీసుకుని భూజాలమీద వేసుకుని దగ్గిరగా లాక్కుని గుండీలు పెట్టుకుంటాడు.)

జేన్! కుంపటిమీద నీళ్ళు పడేసి మరీ పడుకో. నేను రాగానే యిన్ని టీనీళ్లు చేసుకు తాగుతాను. (బయటికి వెళ్ళిపోతాడు.)

(జేన్ పెద్దదుప్పటి వొకటి తీసి బల్లమీద పరుస్తుంది. అందులో పిల్ల బట్టలూ తన బట్టలూ పెడుతుంది. డ్రాయరులోంచి చిన్న గిన్నె తీసి దాంట్లో వున్న చిల్లర జేబురుమాల్లో పోసి మూట గడుతుంది. బట్టలన్నీ మూటగట్టింది. ఉయ్యాల్లో పిల్లని అద్దాలలోకి తీసుకుని. ఒక చేత్తో మూటా రెండో చేత్తో పిల్లనీ పట్టుకుంటుంది. పిల్లకి దుప్పటిబాగా కప్పి బయటికి వెళ్ళిపోతుంది.)



# సీజరుచెల్లెలు

## పాత్రలు

| | | |
|---|---|---|
| లూక్రీజియా బోర్గియా | .... | ఫెర్రారాప్రభ్వీణి (సీజరుసోదరి) |
| సీజరు బోర్గియా | .... | రోమానాప్రభువు |
| టెస్సా | .... | వడ్డనకు సాయంచేసే సేదాసి |
| బాల్టాజార్ | .... | వడ్డనవాడు |
| ఫియామెట్టాస్ట్రొజీ | .... | యినబెల్లా దగ్గిరబంధువు |
| యినబెల్లా డాస్టీ | .... | లూక్రీజియా ఆడబడుచు |
| రికార్డో రిడాల్ఫో | .... | సీజరుసైనికోద్యోగి |
| లెనార్డో డావిన్సీ | | |
| నికొలొ మెఖియవిల్లి | | |
| చిన్న కుక్క | | |

## 1 వ రంగం

(క్రీస్తుశకం 1502. సమయం సాయంకాలం. స్థలం ఇటలీ. అందమైన తెరలతో సన్నగా పొడుగ్గా వున్న వొకభోజనశాల. భోజనాలబల్ల మీద డామాస్కు నేతగుడ్డలు పరిచివున్నాయి. భోజనానికి అన్నీ బల్ల మీద సిద్ధంచేయబడి వుంటాయి. బల్లచుట్టూ యేడుకుర్చీలు అమర్చబడ్డాయి. గదిలో యెడంపక్క వడ్డనబల్ల వుంటుంది. గుమ్మం కుడి ప్రక్కగా ఉంది. వడ్డన బల్ల ఎదురుగా యింకో గుమ్మం బయటిదారిగా వుంటుంది. వెనకపక్క వరండాలోకి భోజనశాలలోంచి పెద్దదారి వుంటుంది. వరండా అవతల అస్తమించే సూర్యుడు ఎర్రగా కనబడుతూంటాడు. టెస్సా అనే దాసి వచ్చి బల్లమీద వడ్డనలో ఏమైనా లోటైనవేమో అని చూస్తూ నిలబడుతుంది. ఇంతలో లూక్రీజియాబోర్గియా ప్రవేశిస్తుంది. వయస్సు ఇరువై రెండేళ్ళు. టెస్సా ఎలా సర్దుతుందా అని నిశితంగా చూస్తూంటుంది లూక్రీజియాబోర్గియా.)

లూక్రీజియా — గౌనుకు వెనక గుండీలు పెట్టుకోలేక వచ్చాను టెస్సా! (టెస్సా వచ్చి గుండీలు పెడుతుంది.) ఏడుగురికి వడ్డన చేశావు. నేను ఐదుగురికని చెప్పాను - ఏం, మాట అర్థంకాలా ?

టెస్సా — అర్థమైంది అమ్మగారు. తమరి అన్నగారు యిప్పుడే వచ్చి ఏడు గురికి వడ్డించమని సెలవిచ్చి వెళ్ళినారు అమ్మగారూ !

లూక్రీజియా — (ఆశ్చర్యంగా) సీజరు యెప్పుడూ యిలానే చేస్తుంటాడు. (టెస్సాతో) ఎవరు వస్తారో చెప్పారా ?

టెస్సా — లేదండీ !

(కుడివేపునుండి సీజరుబోర్గియా ప్రవేశిస్తాడు. షుమారు ఇరవై ఎనిమిదేళ్ళుంటాయి.)

లూక్రీజియా — (సీజరునుచూసి) సీజరు ! నాకిటువంటి పనులంటే చిరాకని నీకు తెలుసు. నావిందు కింకా యిద్దరు అతిథులు వస్తున్నారని టెస్సా చెప్పింది. నిజమేనా ?, (టెస్సా ఎడంప్రక్కనుంచి వెళ్ళిపోతుంది.)

సీజరు — నిజమే లూక్రీజియా !

లూక్రీజియా — ఎవరో తెలుసుకోవచ్చా !

సీజరు — (చిరాగ్గా) ఆ! తప్పకుండా తెలుసుకోవచ్చు చెల్లీ !

లూక్రీ — (కోపంగా) అయితే యెవరో చెప్పు.

సీజరు — (తొందరగా) లెనార్డో డావిన్సీ ఒకడు. (లూక్రీజియా భుజాలు కుంచిస్తుంది.) రెండవఅతను నికొలొ మెఖియవిల్లీ.

లూక్రీ — నీ ఇతరులనుగురించి కొంచెం కూడా ఆలోచనవుండదు. విం దిచ్చేది నేను. బయటివాళ్ళ ప్రశక్తి లేకుండా ప్రశాంతంగా యిసబెల్లా తోనూ, ఆవిడబంధువు ఫియామెట్టాతోనూ కలిసి భోంచేద్దామనుకున్నాను. టెస్సా ఒక్కతే వడ్డనచేస్తుంది. కులాసాగా కబుర్లుచెప్పుకుంటూ భోంచే యాలని సరదాపడ్డాను.

సీజరు — ఇప్పుడు మాత్ర మేమైంది చెప్పు. ఏఇబ్బందీ గొడవా లేకుండానే టెస్సా వడ్డిస్తుంటే బాల్టజార్ ద్రాక్షరసం అందిస్తుంటే భోంచేయవచ్చు. (కుర్చీలు లెఖ్ఖచూసి) నీ మూడోఅతిథి యెవరో చెప్పేవు కాదు.

లూక్రీ — (తనకి సంబంధంలేని విషయంలా) ఆ యెవరూలేరు, రికార్డో రిడాల్ఫో !

సీజరు — (కోపంగా) ఏమిటీ ! రికార్డో రిడాల్ఫోయా !

లూక్రీ – (గర్వంగా) అలా అంటున్నావు, అతడు రావడం నీ కభ్యం తరమా?

సీజరు – అవును. తప్పకుండా అభ్యంతరం వుంది ........... నేను కొంత వరకూ కొన్ని విషయాలు జరగడానికి అంగీకరిస్తాను. లూక్రీజియా! నీభర్త పరాయిదేశాల్లో వున్నప్పుడు నీవేమిచేసినా అభ్యంతరపెట్టను....... కాని నువ్వు నాచెల్లెలివని మరచిపోకు. నీపేరు, ఆ రికార్డోతో జతచేయడానికి నేను యిష్టపడను. మనం బోర్గియాలమన్న మాట గుర్తుంచుకో! మనవంశమర్యాద కాపాడ్డం నీ కనీసధర్మం.

లూక్రీ – నిజం చెప్పాలంటే రికార్డో వచ్చేది నాకోసంకాదు. యిసాబెల్లాకోసం.

సీజరు – అలా అయితే ఆకిశోరసింహానికి నాచెల్లెలు తగలేదుకాబోలు. వాడికి మంచి పాఠం చెపుతాను, సరే!

లూక్రీ - అతడు ఏవిధంగా ప్రవర్తించినా తప్పుగానే తోస్తుంది నీకు. (వరండావైపు వెళుతూ) అమాటమానేద్దాం. ఇంతకీ నువ్వు ఆహ్వానించిన అతిథులు అక్కరమాలిన చుట్టాలు నాపాలిటికి.

సీజరు – (వరండావైపు జరుగుతూ) మెఖియవిల్లీ నా రాజకీయ సలహాదారు. అందుకని అతనికి ఆతిథ్య మీయాలని అనుకున్నాను. ఇక లెనార్డో వంటి గొప్ప యింజనీరు నాసైన్యమంతటిలో లేడు. అతడు బహుముఖ ప్రజ్ఞాధురంధరుడు. ఈ ప్రపంచంలో అతనికి తెలియని శాస్త్రాలూ, విషయాలూ, కళలూ వుండవు.

(ఎడంవైపునుంచి టెస్సా, బాల్టాజారూ ద్రాక్షరసం పాత్రలు పట్టుకునివచ్చి బల్లమీద పెడతారు.)

లూక్రీ – మెఖియవిల్లీ మాటలంటే నాకు తలనొప్పి ........ ఎవరో యింజనీరువచ్చి నాబల్లవద్ద యెందుకుకూర్చోవాలో నాకర్థం కావడంలేదు.

టెస్సా – బాల్టాజార్! నన్ను తప్పించుకు తిరుగుతున్నా వెందుకు?

బాల్టాజార్ – అలాటి పనులేమీ నేను చేస్తున్నా ననుకోవడంలేదు.

టెస్సా – అంతాచోద్యం! నిజంగా నీకు తెలియదా?

బాల్టాజార్ – వట్టి పూసుపోక కబుర్ల కిది సమయంకాదు.

టెస్సా – ఎన్నిచెప్పినా నువ్వీ రాత్రికి నన్ను తప్పించుకోలేవు.

బాల్టా – ఏయ్! నువ్విల్లా అదేపనిగా వాగుతుంటే నేను పనెల్లా చేసుకోనూ అంట. ఇదుగో కొంచెం చెవిని పెట్టుకో. నీవాగుడువల్ల నే నేదైనా పొరపాటు చేశానా కొంప మునుగుతుంది. జాగర్త!

సీజరు — (బాల్టాజార్ వైపు చూసి) చూడు! మొట్టమొదటి అతిథులు వస్తున్నారు.

లూక్రీ — (చేత్తో రమ్మనట్టుగా అంటూ) యిసాబెల్లా, ఫియామెట్టా, రికార్డో - రండి, రండి!

(సీజరూ, లూక్రీజియా నెమ్మదిగా కుడివైపుకు వస్తారు.)

బాల్టా- (టెస్సాతో) అబ్బా నీకు పుణ్యముంటుందే, దాన్ని ముట్టుకోక.

టెస్సా — ఏం! ఇవాళ అంత చిరాగ్గా వున్నావు. (చేతిలోవున్న పంచదార పొడిసీసా అక్కడే పెట్టేసి) యిది ఫలహారాలపైన అందంకోసం జల్లుతారని నాకూ తెలుసు. బాగా జల్లుతా..........ఊ........తరువాత........ (నొప్పి వచ్చినట్టు నటిస్తుంది.)

బాల్టా — విసిగించక అవతలికిపో!

టెస్సా — (బల్లమీదవున్న ఫ్లాస్కు చూపిస్తూ) ఇది ద్రాక్షరసంలో కలిపేదేనా?

బాల్టా — నీ కన్నీ తెలుసు. నీతోవచ్చిన చిక్కేయిది.

టెస్సా — (గోముగా) నామీద మోజున్నప్పు డన్నీ చెప్పేవాడివి.

(కుడిపక్క తెర వెనకనుంచి యిసాబెల్లా, డావిన్సీ, రికార్డో రిడాల్ఫో, మోనాఫియా మెట్టా స్ట్రోజీ - అందరూ ప్రవేశిస్తారు. సీజరు స్వాగతమీయడానికి ముందుకు వస్తాడు. యిసబెల్లా, రికార్డో యిద్దరూ పాతికేళ్ళవాళ్ళు, నవయౌవ్వనంలో వున్నారు. ఫియా మెట్టా ప్రౌఢ. ఒకరినొకరు పలకరించుకున్న తరువాత కర స్పర్శ చేసికొని నుదుటిపై ముద్దు పెట్టుకుంటారు. ఫియా మెట్టా వెంట బెల్టుకు గొలుసుతో కట్టి వొక కుక్కని తీసుకువస్తుంది)

లూక్రీ — ఫియామెట్టా! నీగౌను చాలా అందంగా వుంది. నీబట్టలు నీకీ రాత్రి చక్కని అందా న్నిచ్చాయి.

సీజరు — ఫియామెట్టా! నీఅందం రోజు రోజుకూ ద్విగుణీకృత మౌతుంది. యిసబెల్లా! ఎంతో ప్రేమ వుండబట్టి మాయింటికివచ్చావు.

లూక్రీ — (ఆనందంతో) రికార్డో! నీరాక నాకెంతో ఆనందంగా వుందని తెలుసా?

రికార్డో — (సాలోచనగా) నిజంగానా లూక్రీజియా?

సీజరు — అందరం అలా గాలిలోకి వెళదాం రండి.

(అందరూ కబుర్లు చెప్పుకుంటూ వరండాలోకి వెళతారు. లూక్రీజియా కొత్త అతిథి రాకవిని వెనక్కి మళ్ళుతుంది.)

(తెరలోంచి) లెనార్డో డావిన్సీ వస్తున్నారు.

(లెనార్డో పొడుగ్గావుంటాడు. షుమారు 50 ఏళ్ళు వుంటాయి. జుట్టు అక్కడక్కడా తెల్లబడింది. గడ్డంవుంది.)

లూక్రీ – స్వాగతం లియోనార్డో! మీరు నా యీ చిన్నవిందుకు విచ్చేయడం చాలా సంతోషమైన విషయం.

డావిన్సీ – అమ్మగారూ! మేమంతా తమసేవకులం. ప్రస్తుతం యిక్కడ ఎవరూ లేరు. తమయాజ్ఞప్రకారం తయారుచేసిన "ప్రేమరసం" ఈయమని సెలవా?

లూక్రీ – బట్టీ చాలా త్వరగా దిగిందే! అంత త్వరగా తయారయిందా? (బాల్టాజార్ బల్లమీద పెట్టిన ఫ్లాస్కులాటిదే మరొకఫ్లాస్కు అందిస్తాడు.) కృతజ్ఞతాభివందనాలు, బాగా పనిచేస్తుందా?

డావిన్సీ – అమ్మా! నేను డావిన్సీనని మరిచిపోకండి. "ప్రేమరసం" నేను తయారుచేయలేకపోతే మరెవరూ చేసేవారు లేరంటే నమ్మండి. బాగా పనిచేయడం మాట అలా వుంచండి. ఘాటుగా కూడా వుంటుందని నేను మీకు హామీ యిస్తున్నాను. సర్వాన్నీ మరిపించి, మంచీ చెడ్డల వివక్షత లకు దూరం చేసే యీప్రేమభావం వుంది చూశారూ, చాలా ప్రమాదకర మైందనీ, దాన్ని రేకిత్తించడం అంత అవసరం కాదేమో ననీ నా వూహ. ఇలా అన్నందుకు నన్ను క్షమించండి. కాని ఆలోచించినకొద్దీ ఈవిషయం నవ్వుబాటుగా తోస్తుంది. ఏమైనా అణిగివున్న ప్రేమని మణిగివుండనీయ డమే మంచిదని నాఅభిప్రాయం. ఈలోకంలో ఆశించదగిన వస్తువు వొక్కటే వుంది. అదేమిటంటారా? ప్రజ్ఞమీద మమత!

లూక్రీ - (చిరునవ్వుతో) లెనార్డో! మీరు యౌవ్వనాన్ని యెన్నడూ యెరుగరా? బాల్టాజార్............?

డావిన్సీ – యౌవ్వన మెలాటిదో చవిచూచాను, కాని యెన్నడూ శరీర సౌఖ్యాల్ని కోరలేదు.

లూక్రీ – (బాల్టాజార్‌తో) కిందపడకుండా మంచి స్థలంలో ఈఫ్లాస్కు తీసుకు వెళ్ళి పెట్టు.

(బాల్టాజార్ ఫ్లాస్కుతీసుకువెళ్ళి విషంవున్న ఫ్లాస్కుపక్కనే పెడతాడు.)

డావిన్సీ – ఈపొడుం మీకోసం తెచ్చాను. మీకు కొత్తవిషయాలంటే సరదా అని గ్రహించాను. ఇది కూడా నేను పరిశోధనలవల్ల కనిపెట్టిందే! ఒక్క

సారి పీలిస్తే రెండుమూడు రోజులవరకూ మళ్ళీ పక్కమీంచి లేవనీయ కుండా పడుకోబెట్టి వుంచుతుంది.

లూక్రీ — (సంతోషంగా) మంచిపని చేశారు. యిది నాకు చాలా వుపయోగ పడుతుంది. మీకు నేను కృతజ్ఞురాల్ని.

డావిన్సీ - ప్రమాదం కలగచేయకుండానే యేపనికైనా అద్దుపెట్టాలన్నప్పు డీపొడుం బాగా వుపయోగపడుతుందనీ, దీనిఅవసరం మీ కుంటుందని తెచ్చాను.

లూక్రీ — చాలా మంచిపని చేశారు.(టేబిలువద్గిరికి వెళ్ళి వొకపువ్వు తీస్తుంది.) ఈపువ్వుమీద కొంచెం పొడుం చల్లితే చాలా? గుణం వెంటనే కనబడు తుం దనుకుంటాను.

(బాల్టాజార్ ఎడంవైపునుంచి వెళ్ళిపోతాడు. పువ్వు అలంకా రంగా వక్షుందగ్గిర పెట్టుకుంటుంది.)

డావిన్సీ — చాలా బాగా అవగాహన చేసుకున్నారు. ఈపొడినవాడా అచ్చంగా పుప్పొడిలానే వుంటుంది. (సీజరు వరండాలోంచి ప్రవేసిస్తాడు.)

లూక్రీ — (కిలకిలా నవ్వుతూ) ఎంత తెలివీ, ఎంత ప్రజ్ఞా!

సీజరు — లినార్డోకి స్వాగతం! (కుడిపక్కనుంచి తెరలో) నిఖోలా మెఖి యవిల్లీ వారువస్తున్నారు. (అప్పుడే క్షౌరంచేసుకుని నున్నగా వుంటాడు మెఖియవిల్లీ.)

లూక్రీ — స్వాగతం, సుస్వాగతం మెఖియవిల్లీ!

సీజరు — ఒక్కనిముషం అటూ యిటూ కాకుండా సరిగ్గా టైముకు వచ్చారు.

(అందరూ వరండావైపు నడుస్తారు.)

సీజరు — అందరం ఎరిగున్నవాళ్ళమే. అందుకని ఎవర్ని ఎవరికీ పరిచయం చేయనక్ఖర లేదనుకుంటాను. చాలా చిన్నవిందు. భోజనానికి ముందు కొంచెం ద్రాక్షరసం తీసుకోవాలి మీరు. (మెఖియ విల్లీ చెయ్యిపట్టుకుం టాడు.) నువ్వేమంటావు లినార్డో! రికార్డో, నువ్వూ పుచ్చుకోవాలి! కొద్దిగా తీసుకోండి.

డావిన్సీ, రికార్డో — (వెంటనే) అబ్బే నాకిప్పుడు అవసరంలేదు నన్ను క్షమించండి.

సీజరు — (తిన్నగా వడ్డనబల్లదగ్గిరికి వెళ్ళి) వద్దంటే యెల్లా, కొంచెం పుచ్చు కోక తప్పదు.

డావిన్సీ — పానీయాలజోలికి వెళ్ళవద్దని వైద్యుడు సలహాయిచ్చాడు.
రికార్డో — నావైద్యుడూ అలానే అన్నాడండీ !
సీజరు — డాక్టరు చెప్పేది చెపుతూంటారు. మనం మాత్రం మనపని మాన కూడదు. మీరు కొంచెం తీసుకోవడం తప్పదు. (చప్పట్లు కొడుతూ) బాల్టజార్! బాల్టాజార్ ! (బాల్టజార్ ఎడమవైపునుంచి ప్రవేశం.) ద్రాక్షరసం తీసుకురా! "ఆకలి కరాకరా పుట్టించడానికీ, పళ్ళెం కాళీచేయడానికీ, ఒకే ఒక్క గ్లాసు చాలు" (బాల్టాజార్ నాల్గుచిన్నగ్లాసులు తెచ్చి అంద రికి అందిస్తాడు. డావిన్సీ, మెఖియవిల్లీ, రికార్డో అందరూ అనుమానంగానే గ్లాసులు యేదుకుంటారు.) మీ అందరి ఆరోగ్యంకోసం నేను ముందు చవి చూస్తున్నాను.
డావిన్సీ
రికార్డో } (భయపడుతూ) అందరి ఆరోగ్యంకోసం తాగుతున్నాం.

(నెమ్మదిగా చవిచూస్తారు. సీజరు వెనకతట్టున బాల్టాజార్ నిలబడి "ఫరవాలేదు తాగండి" అన్నట్టు మెఖియవిల్లీని చూసి తల ఆడిస్తాడు.)

మెఖియవిల్లీ — ప్రభువులవారి ఆయ్యోగ్యాభివృద్ధికోసం ప్రార్థిస్తూ దీన్ని పుచ్చు కుంటున్నా. (అని ద్రాక్షరసాన్ని త్వరత్వరగా పూర్తిచేస్తాడు.)
సీజరు — చాలా కృతజ్ఞుణ్ణి. ద్రాక్షరసం అప్పుడే నూతనోత్సాహం యిస్తున్నది. మన శత్రువు యుర్బినో యేంచేస్తున్నాడో యీరాత్రి !
మెఖి — ప్రభువులు, అతడికి మంచి శాస్తి చేశారు.
సీజరు — అవును! మంచి పనే జరిగింది.
మెఖి — దివ్యమైన పనిచేశారు.......... ఆచెయ్యడంలో మళ్ళీ తలయెత్త కుండా నొక్కేశారు విషప్పురుగును నొక్కేసినట్టు.
సీజరు — నేనూ అలానే అనుకుంటున్నాను. ఆడవాళ్ళు మనకోసం యెదురు చూస్తూన్నారు. రండి! (తనలో కక్షగా) రికార్డో! జాగర్త. అమృత హృదయయైన యిసబెల్లాని యెలా ప్రేమించాలో త్వరలోనే తెలుసుకుం దువుగాని.

(సీజరు వరండాలోకి వెళతాడు. అప్పటికే చంద్రోదయ మైంది. పుచ్చపువ్వులా వెన్నెల విరిసింది. సీజరు యిసబెల్లాను తీసుకుని పక్కనున్న పూపొదరింటిలోకి వెళతాడు. అయిష్టత చూపుతున్నా రికార్డోని తీసుకుని లూక్రీజియా కుడిపక్కగా వెళు

తుంది. డావిన్సీ, ఫియామెట్టా మాత్రం మిగులుతారు. ఇద్దరూ చంద్రుణ్ణి చూస్తూంటూరు. మెఖియవిల్లీ గదిలో తారాడుతూం టాడు.)

మెఖి — నిజంచెప్పు బాల్టాజార్ ! యేగందరగోళాలూ లేకుండా విందు సాఫీగా నడుస్తుందటావా ?

బాల్టా — అవునండీ అయ్యాగారూ ! చాలా నిర్మలంగానే జరుగుతుంది విందు. సందేహంలేదు.

మెఖి — నమ్మించి గొంతుకుకోసే అంత నిర్మలంగానా ?

బాల్టా —(చిరునవ్వునవ్వి)లేదండీ! మీరూహించే అంత ద్రోహం జరగదు, కాని ఏదో కొద్దిగా చేయక తప్పదు చూడండి. కాకపోయినా మీపేరు మా జాబి తాలోకి యెక్కలేదులెండి !

మెఖి — ఎవ రెవరి పేర్లు ఎక్కినవి ?

బాల్టా — మీరడిగిన ప్రశ్నకి సమాధానం చెపితే నాపనికే ముప్పు వస్తుందయ్యా గారూ! క్షమించండి. ఒక్కమాట మాత్రం నమ్మండి. తమలాటి ప్రభువుల పైన యీగైనా వాలనియ్యను.

మెఖి — అవును, చేతి తడి అవుతున్నంతకాలం యీగైనా వాలనియ్యవు. బాగానే వుంది. నాపేరు నీజాబితాలో లేదన్నావు, మంచిదే! కాని మధ్యలో మీఅయ్యాగారి బుర్రలో యేదైనా పురుగు పుట్టి నామీదే కళ్ళుపడితే ?

బాల్టా — అలా యెప్పటికీ జరగదండీ! ఒకవేళ ఏమైనా జరిగినా తెలుసుకోడం చాలా సులువండీ. ఏంజరిగినా ద్రాక్షరసంతో కలిపి జరపాల్సిందేగా! "మాంచిరకం" అన్నమాట అయ్యాగారినోట వచ్చిందంటే కొంప ముని గిందన్నమాటే. "చూడు బాల్టాజార్ వీరికి ద్రాక్షరసం కొంచెం తీసుకురా" అంటే ప్రమాదంలేదన్న మాట. ఇలా కాకుండా "మాంచిరకం రసం కొద్దిగా తీసుకురా" అంటే మాత్రం మీరు హెచ్చరికగా వుండాలి. అయ్యాగారు ముందుచెప్పివుంచిన కొలత ప్రకారం 'అది' కలిపి ఈయ డం తప్పదు. అందుకని మీరు "మాంచిరకం" అనే మాటకోసం జాగ ర్తగా నిరీక్షించండి.

మెఖి — తప్పకుండా గుర్తుపెట్టుకుంటాను. (వరండాలోకి వెళ్ళుతూ, పదేపదే 'మాంచిరకం' అనే మాట వల్లెవేసుకుంటాడు.)........మాంచిరకం........ మాంచిరకం....... (ఫియామెట్టా మెఖియవిల్లీని చూసి నిట్టూర్చి అతని వైపు తిరుగుతుంది.)

ఫియా – (విసుగ్గా) లియోనార్డో యింతసేపూ వెలుతుర్ని గురించి చెపుతున్నారు.

మెఖి – ఆహా.......... అల్లానా! (చిరాగ్గావున్న రికార్డో సహితంగా ల్యూక్రిజియా కుడివైపునుంచి ప్రవేసిస్తుంది.)

ఫియా – వాడు చెప్పే దేమీ నాకర్థంకాలేదు.

డావిన్సీ – యిందులో అర్థంకాకపోవడానికి కేముంది ? ........పైనుండివచ్చే వెలుతురు చంద్రబింబంమీద. . ............

ల్యూక్రీ – ఆకిరణాలు ప్రేమనుకూడా వెంట కొనివస్తాయా ?

డావిన్సీ – మీరడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పడాని కివిషయమై శాస్త్రాల్లో యేవిధమైన తార్కాణాలూ లేవు. సముద్రాలనీ, వాటి అలల్నీ యేధర్మం నడిపిస్తుందో అదే ధర్మం అదే నియమం వెలుగు కిరణాలనీ ప్రసరింపజేస్తుంది.

రికార్డో – నిజంగానా ?

డావిన్సీ – అవును. అందుకనే గరిమనాభి............

ల్యూక్రీ – కొంచెం అవతల పనుంది. నన్ను క్షమించండి. (గదిలోకి వెళుతుంది.)

మెఖి – ఈవిషయంమీద యింకా వినాలని నాకు కుతూహలంగా వుంది. బాగా అర్థమయ్యేట్టు చెప్పండి.

(డావిన్సీ చెయ్యిపట్టుకుని అవతలకి వెళ్ళిపోతాడు. విసుగ్గా వున్న రికార్డో, ఫియా మెట్టా మిగులుతారు.)

ల్యూక్రీ - బాల్టాజార్ ! అన్నీ సిద్ధంగా వున్నాయా ?

బాల్టా – అన్నీ సిద్ధంగా వున్నాయి అమ్మగారూ. అన్నీ సిద్ధంగా వుండకుండా పోడాని కిది చిన్న విందే గనుండీ! ద్రాక్షరసం కూడా మామూలు ప్రకారంగానే సిద్ధం చేశాను.

ల్యూక్రీ - అయితే వాటిలో..........

బాల్టా – (అర్థమైనట్టు తలవూపి) లేదమ్మగారూ, అయ్యగారి శెలవు పుచ్చుకుని తరువాత వాటికి 'మాంచిరకం' కలుపుతాను.

ల్యూక్రీ – చాలా మంచిపనే !

(సీజరూ యిసబెల్లా ఎడంపక్కనుంచి రికార్డో ఫియా మెట్టాల దగ్గిరికి వస్తారు. రికార్డో యిసబెల్లా వొకర్ని వొకరు ఆనందంగా చూసుకుంటూరు.)

బాల్టా — ఆరు రకాల వంటలూ, పిండివంటలూ చేశాను. వినండమ్మగారూ ........ మొదటిది పిట్టలవేపుడు, రెండు చక్కని కోడిపుంజుకూర, మూడు కొవ్విన చేప పులుసు, ఇక నాలుగోది లేతమేకపిల్ల మాంసం-వండాను. ఐదు కార్జం రుచిగా వండాను. ఆరోవంటకం అంటారా? మంచి రుచిగా తీపివొకటి చేశాను. రికార్డోగార్ని కార్జంతో సాగనంపేయమన్నారు.

లూక్రీ — నిజంగానా ?

బాల్టా — ఫియామెట్టా అమ్మగార్ని పిట్టమాంసంతో-లెనార్డో అయ్యగార్ని చేపలతో.

లూక్రీ - యివన్నీ యెవరి ఆజ్ఞలురా ?

బాల్టా — యింకెవరిదమ్మా ? ప్రభువువారివే!

లూక్రీ — (ఆశ్చర్యంతో) నిజంగా ! సీజరు ఏపనికైనా తగినవాడు. (వరండా వైపు వెళ్ళి) సీజర్ !

సీజరు — (వస్తూనే) ఏమైంది లూక్రిజియా ? (బాల్టాజార్ వస్త్రసబల్లదగ్గిరగా వెళ్ళి సర్దుతున్నట్లు నటిస్తాడు.)

లూక్రీ — ఏమి టిదంతా ! బాల్టాజార్ చెప్పిందంతా నిజమేనా ?

సీజరు — (కోపంగా) నాకేం తెలియదు. యింతకీ వా డేంచెప్పాడు నీతో ?

లూక్రీ — (తీవ్రంగా) రికార్డో, ఫియామెట్టా, లెనార్డోలకి విషం పెట్టమని చెప్పావా ?

సీజరు — అవును, చెప్పివుంటాను !

లూక్రీ — (చాలాకోపంగా) నా అనుమతి లేకుండా యికముందు యిలాటి హుకుములు జారీ చెయ్యడానికి వీల్లేదు, తెలుసా?

సీజరు — చెల్లీ.......కొంచెం శాంతం.... ..ఎందుకింత వుక్రోషం చెప్పు.

లూక్రీ — విందు జరిగేది నాయింట్లో అని మరిచిపోకు. పైగా ఎందుకని అడుగుతున్నావా ?

సీజరు — అవును. విం దిచ్చేది నువ్వే, నీయింట్లోనే! కాని ఈచిన్నవిషయాని కింత గొడవెందుకు చెప్పు. నీ కివన్నీ యిష్టంలేదని యెలా అనుకోను చెప్పు !

లూక్రీ — నా కివన్నీ యిష్టంలేదు నరా ?

సీజరు — చూడు చెల్లీ, ఏమీ తెలియని అమాయకురాలిలా మాట్లాడకు........ నరే....ఫియామెట్టా పోతే మనకేం ?

లూ|క్రీ — అవును...... ...కాని....

సీజరు — లెనార్డో డావిన్సీ నీకేమీ కాడుగదూ? అతడు చేసిన పరిశోధనల తోనూ, యంత్రాలూ, పరికరాలూ పుచ్చుకుని నాశత్రువుల పక్షంలో చేరి, వారిదగ్గిర వుద్యోగం చేయడానికి వెళ్ళుతాడేమోమరి.......అందుకని....

లూ|క్రీ — లెనార్డో, ఫియామెట్టా లేమైనా నాకు బాధలేదు, కాని రికార్డోని యేం చేసినా........

సీజరు — ఈరోజు నీకు మతి సరిగ్గా లేదు.

లూ|క్రీ — (ఆలోచిస్తూ) ఫియామెట్టా........ ఫరవాలేదు. లెనార్డో కూడా........ సరే........కాని రికార్డో సంగతి మాత్రం వీల్లేదు.

సీజరు — నీవిచ్చేగాని, రికార్డోకి నీమీద రవ్వంతకూడా అభిమానం వున్నట్టు కనబడదు.

లూ|క్రీ — ఈవిషయం నీకనవసరం. ఈ యిల్లు నాది. దీని కధిపతిని నేను. నాయింట్లో యేం జరిగినా నా అనుమతి మీదే జరిగి తీరాలి. నాయిష్టా నికి వ్యతిరేకంగా విషం యెవ్వరికీ యివ్వడానికి వీల్లేదు. రికార్డోమీద యీగ వాలడానికి నేను సమ్మతించను. తెలిసిందా!

సీజరు — సరే నీయిష్టం! రాజీకి నేనెప్పుడూ సిద్ధమే! (చప్పట్లు కొట్టి) బాల్టా జార్! రికార్డోకోసం చేసిన ప్రయత్నం మాను.

బాల్టా — (వడ్డనబల్లమీద వున్న పేర్లజాబితాలోంచి రికార్డో పేరు కొట్టివేస్తాడు) చిత్తం! ప్రభువులు చెప్పినట్లే చేస్తాను.

లూ|క్రీ — వడ్డనప్రయత్నం వెంటనే చెయ్యి. (సీజరూ, లూక్రీజియా, మిగతా వాళ్ళని కలుసుకోడానికని వరండాలోకి వెళతారు.)

బాల్టా — అలానే వడ్డిస్తాను అమ్మగారూ. (ఎడంవేపుకు తిరిగి) టెస్సా........ టెస్సా! వడ్డన శీఘ్రంగా కావాలి. (ఏడు ప్లేట్లలో అన్నీ సర్ది ట్రేలో పెట్టు కుని టెస్సా ప్రవేసిస్తుంది.)

టెస్సా — యింకా యేమైనా సవరించాలా?

బాల్టా — అఖ్ఖర్లేదు. మొదటి వడ్డనలో అంతా మామూలే .... ఊఁ....త్వరగా కానియ్యి.

టెస్సా — (త్వర త్వరగా పళ్ళాలు సర్దుతూ) విషంకలిపిన ద్రాక్షరసాని కీరోజేం మారుపేరు పెట్టారు?

బాల్టా — అది నీ కనవసరం.

టెస్సా – చెప్పవూ ! జరిగే తమాషా నాకూ చూచి ఆనందించాలని వుంది!
బాల్టా – నీకు చెప్పినపనేదో నువ్వు సరిగ్గా చేద్దూ, చాలు.
టెస్సా – చెప్పరూ ! నీకు సరిగ్గా వినబడదుగా. అప్పుడు నే నందిస్తాను.
బాల్టా – నాకు వినబడకేం ? నిక్షేపంలా వినబడుతుంది. ఇదిగో "మాంచి రకం" అనే మాట వినబడగానే మాత్రం చెప్పేం ! (వరండావైపు వెళ్ళి) వడ్డన పూర్తిఅయిందమ్మగారూ !
సీజరు – (కుడివైపు వచ్చి) లెనార్డో, నికోలో, భోజనం తయారుగా వుంది !
(లెనార్డో, నికోలో ప్రవేసిస్తారు)
ల్యూక్రీ – అంతా మనమే. కొత్తవాళ్ళెవరూ లేరు. మర్యాద లనవసర మనుకుంటాను.

(ల్యూక్రీజియా రికార్డో చెయ్యిపట్టుకుంటుంది. సీజరు యిసబెల్లా చెయ్యి అందుకుంటాడు. ఫియామెట్టాని డావిన్సీ తీసుకొచ్చే వరకూ వూరుకుంటాడు. మెఖియవిల్లీ, అందరూ కబుర్లు చెప్పకుంటూ వచ్చి కూర్చుంటారు. ల్యూక్రీజియా స్టేజిఎదురుగా కూర్చుంటుంది. ఆమె కుడివేపు డావిన్సీ, ఎడంవైపు రికార్డో కూచుంటారు. టేబిలుకు ఎడంప్రక్కగా సీజరూ, కుడివైపుచివర ఫియామెట్టా కూచుంటారు. ఫియామెట్టా తనకూచున్న దగ్గిరే వెంట తీసుకొచ్చిన కుక్కపిల్లని కట్టేస్తుంది. సీజరు పక్కనే యిసబెల్లా, ఫియామెట్టా పక్కనే మెఖియవిల్లీ కూచుంటారు. బాల్టాజారు బల్లచుట్టూ తిరుగుతూ పానీయాలు యిస్తూంటాడు )

యిస – ల్యూక్రీజియా ! యీబల్లమీదవేసిన డామాస్కు పూలగుడ్డ యెంత అందంగావుందో చెప్పలేను. చాలాకొత్తరకంగా వుంది.
ల్యూక్రీ – అంత బాగా వుందా ?
యిస – బాగుందా అని నెమ్మదిగా అంటున్నావూ ! అందాలలో ఆరితేరిన ఫరాసువాళ్ళు నీముందు ఎందుకూ పనికిరా వంటేనమ్మ.
సీజరు – ల్యూక్రీజియాకు ఫ్రెంచిరాయబారి కొనితెచ్చిన దుస్తులు చాలా అందంగా వున్నాయి. బహుశా రికార్డోకి వాటి అందం యెక్కువ తెలుసనుకుంటాను.
రికార్డో – (నిరుత్సాహంగా) వాటిని చూడాలని వుంది.
యిస – వాటిని గురించిన వివరాలు కొన్ని చెప్పండి వినాలనివుంది.

లూక్రీ – రంగు నీలిమబ్బు. పాముకుబుసాల్లా, మిలమిలా మెరిసిపోతున్నాయి. మెడకింద అందంగా దిగువకంటే కత్తిరించి కుట్టారు.

ఫియా – (ఉత్సాహంగా) నిజంగానా ?

(డావిన్సీకి ద్రాక్షరసం యివ్వబోతే వద్దంటాడు.)

లూక్రీ - అంతా వెండి, బంగారు నగిషీపని. మంచిముత్యాలు గుత్తుల్లా అమర్చారు. మెడచుట్టూ యీ లతలు కుట్టడానికి సుమారు ఆరునెలలు పట్టిందట.

యిస – అవును. వింతకదా మరి !

ఫియా – అబ్బబ్బ ! యిక వర్ణించకు. వింటుంటేనే నాకు దాన్ని చూడాలని మనసు ఉవ్విళ్ళూరిపోతూంది. నిజంగా అటువంటి అపూర్వమైన దుస్తులు నీదగ్గిర వున్నందుకు నాకు చాలా ఈర్ష్యగావుంది ! ఎప్పుడు చూస్తానా వాటి నని చచ్చిపోతున్నాను.

(ఫియా మెట్టా చచ్చిపోతున్నాననే మాట అనగానే అందరూ వొకరిమొగాలు వొకరు చూసుకుంటారు. వులిక్కిపడి ముందు పెట్టిన భోజనాన్ని అనుమానంగా చూస్తూంటారు. సీజరూ, లూక్రీజియా, మెఖియవిల్లీమాత్రం నిర్విచారంగా ఉంటారు. ఫియా మెట్టాతన పళ్ళెంలో మాసంతీసి కుక్కపిల్లకి వేస్తుంది. అది ఆత్రంగా తినడం కనిపెట్టి నిర్భయంగా భోజనం మొదలుపెడుతుంది.)

టెస్సా – యిలా చూడు బాల్టాజార్ - ఆ ఇంటిపనికత్తె వెంట బడకపోతే, పూర్వంలాగే నాదగ్గిరికి రారాదూ ?

బాల్టా – అదిగో ! అదే నేవద్దన్నాను. నేను యెవరివెంటాబడి తిరగడంలేదు.

టెస్సా – దాని అందమైన నొక్కులజుట్టు చూస్తే నీమనసు వుండబట్టదని నాకుతెలుసులే !

బాల్టా – కావచ్చు ! అందాన్ని సరసు డెవరైనా కోరుతాడు. తప్పా ?

మెఖి – లెనార్డో ద్రాక్షరసం పుచ్చుకోడు. అమ్మగారూ ! ఘనమైన మీ విందుల్లో దానికి వప్పుకుంటారా ?

డావిన్సీ – చాలా వయస్సు ముదిరినవాళ్ళు భోజనాలదగ్గిర కొంచెం జాగ్రత్తగా ఉండడం మంచి దనుకుంటాను.

ఫియా – వెలుగూ, కిరణప్రసారం గురించి వుపన్యసించిం తరువాత గొంతు తడిఆరి మరీ దాహంగా వుంటుంది. లెనార్డో ! మీనివాసం ఫ్లారెన్సునగరం కదూ ! నామాట నరేనా ?

డావిన్సీ — నేను పుట్టింది ఫ్లారెన్సు సమీపంలోనే నమ్మా.
ఫియా — అందరూ చెప్పేఅంత చెడ్డఊరేనా ఫ్లారెన్సు?
సీజరు — చాలా కుతూహలమైన ప్రశ్నే నీది, ఫియామెట్టా?
ఫియా — వితంతువు నైనంత మాత్రంచేత నామనసులో కోర్కెలు మాయమైపోయా యనుకున్నావా? కుతూహలం నాకుండకూడదా?
యిన — యేం మాట లవి, ఫియామెట్టా.
ఫియా — ఆహహా పదహా తప్పటడుగులు వేయకపోతే పశ్చాత్తాపపడడాని కేముంటుంది చెప్పు?
మెఖి — లెనార్డోమట్టుకు, తనదేశాన్ని స్థలాన్ని గురించి మంచనీ, చెడ్డనీ యెలాచెప్పగలడూ అని? యెవరి మానానికీ పోక ఎల్లప్పుడూ యేదో ఆలోచిస్తూ కూచుని తనగది అనే ప్రపంచంలోంచి యివతలకి రానివాఁ కివన్నీ తెలియడానికి అవకాశంలేదు. అంత భావుకుడు కాబట్టే శిల్పి, గాయకుడూ, కవీ, వేదాంతీ, తార్కికుడూ, విజ్ఞాన శాస్త్రజ్ఞుడూ, గణిత శాస్త్రవేత్తా - యింకా యేమేమిటో అయ్యాడు. దీని కంతకి కారణం నిష్క ల్మష జీవితమే!
రికార్డో — లెనార్డో రోమూనా యెలావుంది మీకు?
డావిన్సీ — విజ్ఞానశాస్త్రరీత్యా మీ నాలుగుచక్రాలబండ్లు చేసేవిధానం తప్పు. అవి నాకు నచ్చలేదు.
యిన — చక్కగా చెప్పారు. ఎంతైనా యింజనీరుగదా.
సీజరు — మీపరిశోధనలవల్లా, మీరు కనిపెట్టే కొత్త పరికరాలవల్లా ప్రపంచంలో యుద్ధాల్ని తారుమారుచేస్తారు.
మెఖి — కావచ్చు! యుద్ధధర్మాన్ని కొత్త పరికరాలూ, పనిముట్లూ మార్చ లేవు. యుద్ధంలో సైన్యం బలాబలాలన్నీ పదాతులమీదే హెచ్చుగా ఆధార పడి వుంటుంది.
డావిన్సీ — మీరు చెప్పింది కొంతవరకూ నిజమే. కాని కొత్తయుద్ధ పరికరం వచ్చిందనగానే, దాని ఉపయోగం యెల్లావున్నా, శత్రు సైన్యంలో వొక విధమైన మానసికదౌర్బల్యం యేర్పడుతుంది. ఈభీతికీ నిజానికీ చాలా దూరం కావచ్చు. అయినా ఆదౌర్బల్యం తప్పదు. (టెస్సా మొదటిసారి తెచ్చిన పళ్ళాల్ని తీసుకు ఎడంవైపుగా వెళ్ళిపోతుంది.)
మెఖి — ఏమైనాకానీ, యుద్ధాల్లో ఒకపట్టును సాధించేది కాల్బలమే-ఇంతవరకూ

ఈవిషయమై ఎన్నడూ యుద్ధం మొగమెరగని మీరూ నేనూ వాదించుత మేమిటి? పైగా రికార్డోవంటి వీరుణ్ణి దగ్గిరపెట్టుకుని మనం చర్చలు చేస్తున్నాం.

లూక్రీ — అవును.......రికార్డో.......చాలాయోధుడు.

రికార్డో — మా జయాపజయాలన్నీ నిజంగా మావిగావు. మమ్మల్ని ముందుకు నడిపించే నాయకుడివి. (సీజరువంక సగౌరవంగా చూసి తలవంచుకుంటాడు.)

యిన — ఎంత అణకువా ?

మెఖి — సైన్యమంతటిలో చాలా సాహసవంతుడని పేరుపొందాడు. సంభాషణా చతురుడనీ గణుతికెక్కాడు.

సీజరు — రికార్డో హాస్యచతురుడని యెరుగను !

మెఖి — ఈమధ్య జరిగిన చిన్ని సంఘటన మీవరకూ రానేలేదా ?

సీజరు — నాకేమీ తెలియదు. ఏం జరిగింది ?

మెఖి - మాటల సందర్భంలో "ఐదుబోర్గియా యుద్ధాలలో ఆపద లేకుండా బతికి బయటపడినట్టే మూడు బోర్గియా విందుల్లోంచి ఈగవాలకుండా యివతలపడ్డానని" ఛలోక్తి విసిరాడు.

(చాలా కోపంగా లూక్రీజియా మెఖియవిల్లీ వంకచూస్తుంది. రికార్డోని విషపూరిత దృక్కులతో సీజరు చూస్తాడు. టెస్సా ఎడంవైపునుంచి రెండోసారి వడ్డనకు పళ్ళాలు తీసుకువస్తుంది. బాల్టాజార్ దారిలో ఆపి వొకపళ్ళెం తీస్తాడు.)

బాల్టా — (ఒకపళ్ళెంతీసి ఫియామెట్టాకోసం వేయించిన పిట్టమాంసం వేసి విషం దానిమీద చల్లుతాడు. తన దగ్గిర వున్న జాబితాలోంచి ఫియామెట్టా పేరు కొట్టేస్తాడు. టెస్సాతో) ఇదిగో! ఇది ఫియామెట్టాగారికోసం.

సీజరు — (మామూలు ఉల్లాసంతో) రికార్డో! మకుటాయమానమైన చాతుర్యం వెల్లడించావు !

యిన — (ఆత్రంగా) మీ విందు ఎంత పుష్కలంగా ఉంటుందో వర్ణించడానికి ఏదో అన్నాడు — అంతకన్నా మరేంలేదు!

సీజరు — అయితే కావచ్చు! ఎన్నటికీ మరువలేం.

లూక్రీ — (చిరునవ్వుతో) నికోలో! వింతకథలు బాగాచెపుతావే ! (తనవక్షానికి పెట్టుకున్న గులాబిపువ్వు అతనిపైకి విసురుతుంది.)

మెఖి — (అనుమానించకుండా) అమ్మా! మీ కానుకకు ధన్యుణ్ణి.

డావిన్సీ — (విమర్శిస్తున్నట్టు) సౌందర్యవతుల మన్నన లందుకునే విధానం నీకు బొత్తిగా తెలిసినట్టు లేదు. "డాన్ టీ" కవి భావగీతాన్ని ఆలాపిస్తూ పుష్ప సౌరభాన్ని ఆస్వాదించాలి.

"తాదాత్మ్య మెరుగనీ తనువుకే నీవు.
తారుణ్య మెంతేని తాగూర్చినావు.
తారుణ్యమేగూర్చి తనబాహువులలో
జిక్కించుకొనె నన్ను జాలి దలంచి."

మెఖి — ధన్యుడవు! ప్రతిభావంతుడైన కవివీ, శిల్పివీ, మేటి గణితజ్ఞుడవే గాక సరసతా, రసజ్ఞతాకూడా నీవిద్యలేనా? నీ కీ లోకంలో రాని విద్యంటూ లేదా?

లూక్రీ — లెనార్డో చెప్పినట్టు సరసతతో నే నిచ్చిన పూవును స్వీకరించి ఆస్వాదిస్తేచాలు. డేన్‌టీగీతం అంత అవసరం కాదేమో! (మెఖియ విల్లీకి కొంచెం అనుమానం కలుగుతుంది.) కాని పువ్వుమాత్రం తప్పని సరిగా సువాసన చూడాలి మీరు.

మెఖి — (సరే, ఏదో కానిమ్మన్నట్లు) ఓ, డాంటీకూడా వినిపిస్తాను.

"తాదాత్మ్య మెరుగనీ తనవు నే నీవు
తారుణ్య మెంతేని తాగూర్చినావు
తారుణ్యమే గూర్చి తనబాహువులలో
జిక్కించు కొనె నన్ను జాలిగా నెంతో.

(పువ్వు గట్టిగా పీలుస్తాడు. డావిన్సీ, లూక్రీజియా ముఖముఖాలు చూసుకుంటారు. బెస్సా పళ్ళాలు పెడుతుంది. ఫియా మెట్టా తిన డానికి కత్తి, చెంచా తీస్తుంది.)

ఫియా — లూక్రీజియా! కళ్ళు మిరి మిట్లు గొలుపుతున్న నీదుస్తులన్నీ నాకు త్వరగా చూపించాలి సుమా!

లూక్రీ — తప్పకుండా చూపిస్తాను.

(మెఖియవిల్లీకి మైకం ఆరంభమౌతుంది.)

ఫియా - రేపు రానా? చూపిస్తావా?

లూక్రీ - రేపటివరకూ నీ మనసు మారకపోతే అల్లానే చూపిస్తాను. (లోలోన నవ్వుకుంటుంది.)

ఫియా — అన్నమాట తప్పకూడదు సుమీ?

లూక్రీ - నీయిష్టం. రేపు నువ్వు యెప్పుడు వచ్చినా చూపడానికి నేను సిద్ధమే !

ఫియా — రేపు రావడం తప్పదు. ఏమైనా, ఏది అడ్డువచ్చినా సరే వచ్చి తీరుతాను.

(తినబోతూ, ముందు కొంచెం కుక్కపిల్లకి వేస్తుంది. కుక్కపిల్ల వాసనచూసి వదిలేస్తుంది. ఫియా మెట్టా కత్తీ, చెంచా వెనక్కి పెట్టేస్తుంది. యిది చూసి మిగిలినవాళ్ళు తినడానికి జంకుతారు.)

సీజరు — ఫియామెట్టా ! తినడంలేదు. నీకీ వంట బాగాలేదా ?

ఫియా — నా తత్వాని కీవంటకం పడదు !

యిన - అదిగాదండీ ! ఆవిడగారీమధ్య చిక్కే ప్రయత్నాలు చేస్తూన్నారు.

(అతికష్టంమీద మెఖియవిల్లీ లేచి నిలబడి మూలుగుతూ, రెండుచేతులతోనూ రెండుకణతలూ నొక్కుకుంటాడు.)

లూక్రీ — (కళ్ళు చిట్లించి) నికోలో ! వెళ్ళిపోతున్నావా ?

మెఖి — (నీరసంగా) క్షమించు. ....తా........నంటే,......అలాగే........దేవీ !

లూక్రీ — (నవ్వుతూ) పాపం ! అప్పుడే వెళ్ళిపోతున్నావని విచారంగా వుంది !

(డావిన్సీ, లూక్రీజియా ముఖముఖాలు చూసుకుంటారు, సీజరిది గ్రహించి ఆశ్చర్యంగా తలగోక్కుంటాడు.)

సీజరు — (లేచి కుడివైపుగా వెళతాడు, మెఖియవిల్లీని మర్యాదగా సాగనంపడానికి) నిఖోలో కత్తి, టోపీ అందీయండి.

(తెరలో టోపీ, కత్తి నిఖోలోవారివి.)

యిన — ఉప్పువేసిన యీగిన్నె యెంత అందంగా వుందో !

లూక్రీ — బంగారుమీద ఎనామిల్ నగిషీలంటే నాకు ప్రాణం.

యిన — దీన్నెవరు చేశారు ?

లూక్రీ — యేదీ.......చూడనియ్యి........ సీజర్.........దీన్నెవరు చేశారో నీకు జ్ఞాపకముందా ?

సీజరు — 'గిబార్డీది' గదూ ?

డావిన్సీ - యిక్కడనుంచి చూడడానికి 'ఫొరెన్‌టైన్' శిల్పంలా వుంది. డాన్‌టెల్లీదా ?

లూక్రీ – ఆ.......అవును. డాన్‌టెల్లీవే !

సీజరు - ఇద్దర్లో ఎవరిదైనా దీన్ని తయారుచేసిన ఘనత ఫ్లొరెన్సునగరానికే దక్కుతుంది.

యిన – లెనార్టో, నీకు శిల్పంతోపాటు నగలపనికూడా వచ్చా ?

డావిన్సీ – అస లేమీ రాదు !

రికార్డో – మీరు చాలా చిత్రమైన యింజనీరు !

డావిన్సీ – విన్నారూ యీ సామెత ? "వెండిబంగారాల పనిచేసే శిల్పి తన తెలివితేటలను కరగబోసుకున్నట్టే" అదే నా వూహ.

(టెస్సా వచ్చి రెండోసారి పెట్టిన పళ్ళాలు తీసుకువెళ్ళిపోతుంది.)

సీజరు - రాజకుటుంబాలలో మాత్రమే వుండే యీలాటి వస్తువులకు, వారి వంశాలకు వలెనే శాశ్వతత్వం లేదని అతని నమ్మకం.

యిన - (వేళాకోళంగా) లెనార్డో వాదనలంటేనే నాకు తలనెప్పి - అందుకే ఏవిషయంలోనూ అతనికీ నాకూ పొత్తు కుదరదు.

లూక్రీ - ఏమి టలా అంటున్నావ్, ఏం చేశాడు ?

యిన - యేం చెయ్యలేదని అడుగు. ఎంత బతిమాలినా నాబొమ్మ చిత్రించలేదు.

లూక్రీ -- లెనార్డోకి చిత్రలేఖనంకూడా వచ్చా ?

యిన - ఎంతో మంచి చిత్రకారుడు. కానేంలాభం? చిత్రించాలనే బుద్ధే కుదరదుగా !

రికార్డో – చిత్రలేఖనం వచ్చా ?........... ఇకనుంచీ చిత్రలేఖకు డనే పిలుస్తాను.

లూక్రీ – సీజర్ ! నాకీవిషయం యెప్పుడూ చెప్పలేదేం !

సీజరు – చెల్లీ ! లెన్నార్డో యిక్కడికి వచ్చింది యింజనీరుగా మాత్రమే !

డావిన్సీ – నాకు చిత్రలేఖనం బాగా రాదు...చాలా కొద్దిగా నేర్చుకున్నాను.

(టెస్సా మూడోసారి వడ్డనపళ్ళాలతో ప్రవేశిస్తుంది. మళ్ళీ బాల్టాజార్ ఆపి వొకపళ్ళెం తీస్తాడు.)

బాల్టా – (చేపలకూరలో యిదివరకులానే విషం జల్లుతాడు.) యిదిగో యిది డావిన్సీగారికి, తెలిసిందా ! (చేతిలోవున్న జాబితాలోంచి పేరు కొట్టేస్తాడు) టెస్సా, త్వరగా వడ్డించాలి !

యిన – లూక్రీజియా! లెనార్డోమాట వొక్కటికూడా నమ్మక. మిలాన్‌లో యితనిమీద మోజు యింతింతని చెప్పడానికి వీల్లేదు. మొట్టమొదటిసారి కలుసుకున్నాం – నాబొమ్మ ఎంతోబాగా గీసాడు. అందరూ నన్ను చూసి అసూయ పడ్డారంటే నమ్ము. రంగుల బొమ్మకూడా వేయమని అడిగాను. ఊహూ వినలేదు. దీనికోసం ఫ్లోరెన్సు కూడా వెళ్ళాను. మోకరిల్లి బతిమాలాను, ప్రార్థించాను. వింటేనా! (చిలిపిగా) అందుకే నువ్వంటే నాకిష్టంలేదని చెపుతున్నాను లెనార్డో!

డావిన్సీ – రేఖాచిత్రం గీశాను గదా!

(కత్తీ, ఫోర్కూ తీసుకుని భోంచేయడానికి సిద్ధపడతాడు.)

లూక్రీ – లెనార్డో! నావర్ణ చిత్రం వేయక తప్పదిక. (అతను తినకుండా ఆపుతూ) టెస్సా! వీరు చేపలు తినరు. ఈపళ్ళెం తీసేయి! (ఈమాట విని లెనార్డో కొంచెం ఆశ్చర్యపోయి కారణమేదో వుంటుందని గ్రహించి మళ్ళీ తేరుకుంటాడు. సీజరు చెల్లెలివంక వొక్క విషపు చూపు చూస్తాడు. లూక్రీజియా దీనికి సమాధానంగా చిరునవ్వు నవ్వుతుంది. టెస్సా వచ్చి పళ్ళెం తీసుకుపోతుంది.)

సీజరు – (ఏమీజరగనట్టుగా) రికార్డో నీగ్లాసు కాళీగా వుందే!

రికార్డో – (తొందరగా) నాకిక ఏమీ వద్దు క్షమించండి.

సీజరు – యేమిటిది రికార్డో, వయసులో వున్నవాడివి. నీవే యిలా అంటే యెలా? చూడు బాల్టాజార్! రికార్డోగారికి "మాంచిరకం" ద్రాక్షరసం తెచ్చి యియ్యి.

('లూక్రీజియా! నేనే గెలిచాను చూశావా!' అన్నట్టు చెల్లెలి వంక చూస్తాడు సీజరు. బాల్టాజారు గ్లాసులోకి విషం ఫ్లాస్కులోని ద్రావకం వంపుతాడు.)

ఫియా – లెనార్డో చేత వర్ణచిత్రం వేయించుకోవడం జరిగేపనికాదు. అసలు రేఖాచిత్రం గీయడానికే వొప్పుకోడు. ఒకవేళ వొప్పుకున్నాడా వెయ్యటమే మొదలుపెట్టడు. ఎల్లాగో మొదలు పెట్టినా దాన్ని పూర్తి చెయ్యడు. మీలాన్‌లో యీాయనగారు పోసిన కంచువిగ్రహం సంగతి యెరగని వారెవ్వరూ లేరు. (పళ్ళెంలోవున్న చిన్న మాంసంముక్క కుక్కకి వేసి అది తినడం గమనించి తనూ తినడం మొదలుపెడుతుంది.) గుర్రాన్ని స్వారిచేస్తున్న వీరుణ్ణి తయారు చేయాలని అసలు సంకల్పం.

గుజ్జాన్నిఎల్లాగో అల్లాగా చేశాడా దానిమీద వీరుడిమాట మళ్ళీ యెత్తితేనా! పాపం, ఈనాటికీ అగుర్రం రౌతుకోసం పడిగాపులు పడేవుంది. యిక యిన బెల్లా చిత్రంగాని లెనార్డో మొదలుపెట్టాడో అవిడ అమ్మమ్మ అయినా అది పూర్తిగాదు.

(బాల్టాజార్ రికార్డోగ్లాసు నింపుతాడు. ఏంజరుగుతుందో చూద్దామని రికార్డో వెనకాలే నుంచుని వుంటాడు. రికార్డో తాగడానికని గ్లాసు ఎత్తుతాడు. లూక్రీజియా ప్రమాదవశాత్తు చెయ్యి గ్లాసుకు తగిలినట్టుగా తనచెయ్యి యెత్తి గ్లాసులో ద్రాక్ష రసం ఎగరగొట్టుతుంది. అదిచింది వెనకనుంచున్న బాల్టాజార్ నోట్లో కొంచెం పడుతుంది. అతను భయపడి వరండాలోకి పరు గెత్తుతాడు.)

లూక్రీ — రికార్డో క్షమించు. పొరపాటు జరిగింది. చూళ్ళేదు.

రికార్డో — తప్పు తమదికాదు నాది!

లూక్రీ — తప్పునాదే! చిత్రపటం సందడిలో చూచుకోలేదు.

సీజరు — లెనార్డో నీబొమ్మ గీస్తానని మాట ఇంకా ఈయలేదు కదూ?

లూక్రీ — మాట యివ్వక పోవచ్చు! తప్పకుండా నా బొమ్మ వేస్తావుకదూ లెనార్డో!

డావిన్సీ — నన్ను క్షమించాలి మీరు.

లూక్రీ — సాకులు చెప్పడాని కిక వీల్లేదు. నా కోరిక నెరవేర్చక తప్పదు.

సీజరు — నీ ఇంజనీరు వృత్తి కిదేమీ భంగం రాదు లెనార్డో!

లూక్రీ — సీజరుమాట విన్నావుగా! నీకోసం ప్రత్యేకంగా వొకగదికూడా నాయింట్లోనే ఏర్పాటుచేస్తాను.

యిన — పనిలోపని నాబొమ్మకూడా వెయ్యాలి సుమా.

ఫియా — నాదికూడా వెయ్యాలి.......... యింతకన్నా మాముగ్గుర్నీ కలిపి వేస్తే తీరిపోతుందేమో! మేం మంటే లూక్రీజియా, యినబెల్లా, నేనూను.

డావిన్సీ — అడిగీ, ఆజ్ఞాపించీ నాచేత బొమ్మలువేయించలేరు. మీరు చెప్పే నిర్ణీతకాలంలో, నిర్ణీతమైన వైశాల్యంలో, బొమ్మలువేయడం నావల్ల మాత్రంకాదు. ఒక చిన్న కథవుంది. పూర్వం వొక చిత్రలేఖకుడున్నాడట. ఆయనభార్యతో అనేవాడట "ఇదిగో యిలాచూడు! నువ్వు వడ్డించేసెయ్యి నేను యీలోగా వొక ఋషిబొమ్మ వుంది గీసేసి వచ్చేస్తాను. అలా చెప్పడం

గాని, చేయడం గాని నావల్లగాదు. నామనసుని కంపింప జేసే విగ్రహం కావాలి. నేను అప్పుడే బొమ్మ గీయగల్గుతాను. నేను యిటీవలబొమ్మలు వేయడం మానేశాను.

యిస – చక్కని స్త్రీమూర్తి కోసం వాడవాడలా వెతుకుతున్నావని తెలిసికూడా నువ్వు చెప్పేమాటలు నమ్మమంటావా, డావిన్సీ ?

లూక్రీ – యేమి లేమిటీ? స్త్రీమూర్తిదా ?

యిస – అవును. ఒక సామాన్య పల్లెటూరి స్త్రీమూర్తిది!....... మోనాలిసా అనేది.... ..

లూక్రీ – సామాన్య స్త్రీనే నువ్వు చిత్రించడానికి పూనుకున్నప్పుడు నాబోటి వాళ్ళ చిత్రం వేయడం నీ కేమంత కష్టమైన పనికాదు లెనార్డో!

డావిన్సీ – అమ్మా! యింపాక చెప్పిన మాటలే మళ్ళీ అంటున్నందుకు క్షమించండి. చిత్రకారుడు చేయవలసింది విగ్రహం నకలుగీయడం కాదు. నిజమైన చిత్రకారుడు తను గీసేవాళ్ళ హృదయభావాల్ని ప్రతిబింబింపజేయగల్గడంతోగాని తృప్తి పడలేడు.

(బాల్టాజార్ తూలుతూ వడ్డన బల్లదగ్గిరికి వస్తాడు. చేత్తో కడుపు పట్టుకొని నుంచుంటాడు.)

లూక్రీ – నా మనోభావాలు బొమ్మలో బాగానే కనిపిస్తాయనుకుంటాను.

ఫియా – చక్కని అగ్రెంచిదుస్తులు వేసుకు కూచుంటే........

డావిన్సీ – నేను చెప్పే దేమంటే....... ....

లూక్రీ – చెప్పడాని కేమీలేదు...........ప్రత్యేకంగా గది ఈయడం, దాంట్లో పరికరాలన్నీ సమకూర్చడమే యిక మిగిలింది.

డావిన్సీ – నామాట కొద్దిగా వినండి.

లూక్రీ – ఇక మాట లేమీలేవు! అన్నీ స్థిరపడి పోయాయి.

డావిన్సీ – కాని నాదొక చిన్న మనవి!

లూక్రీ – చిన్న పటమైనా ఫరవాలేదు.

డావిన్సీ – చిన్నా పెద్దా గాదు ముఖ్యమైంది, చూడండీ........

లూక్రీ – అనవసరపు టడ్డులు పెట్టవద్దు, లెనార్డో. అడ్డులూ, యిబ్బందులూ భరించే అలవాటూ, వోపికా కూడా నాకు లేదు!

డావిన్సీ – ఏది ఏమైనా మీరు నన్ను క్షమించి వదలివేయాలి.

లూక్రీ – సరే అయితే!

(మనసులో చిరాకు పడుతుంది. సీజరు వెటకారంగా చూస్తూ చిరునవ్వు నవ్వుతాడు. ఇది చూసి చూడనట్టే వూరుకుంటుంది లూక్రీజియా. అంతా నిశ్శబ్దం. ఇంతలో ఎడంవైపునుంచి బాల్టా జార్ ప్రవేసిస్తాడు.)

టెస్సా — ఏమైంది ?

బాల్టా — నాకూ విషం........పడిందనుకుంటాను.

టెస్సా — అనుకోవడమేమిటి ? నీకు తెలియదా ?

బాల్టా — చచ్చిపోతానని భయంగావుంది ......... ఏమో........ ఏంజరుగుతుందో !

(నెమ్మదిగా మూల్గుతాడు. టెస్సా చిరాగ్గా తలతిప్పుకుంటుంది. మూడోసారి వడ్డన చేసిన పళ్ళాలు లేవడానికి వెళ్ళిపోతుంది.)

రికార్డో — (ఎలా అయినా సంభాషణ అరంభించాలని) లినార్డో ! ప్లోరెన్సు అన్ని విషయాల్లోనూ ముందడుగు వేసినా ద్రాక్షరసాల కృషిలో మాత్రం వెనకబడి వున్నదని చెప్పక తప్పదు.

డావిన్సీ — (ఈమాట్కు సంతోషించి) ద్రాక్షతోటల వ్యవసాయంలో కొన్ని కొత్తమార్పులు అత్యావసరం. అదిగాని మేం చేయగల్గితే మేలురకంపంట పండించగలం.

రికార్డో — మీదేశంయొక్క శీతోష్ణస్థితి మా టేమిజేస్తారు ?

డావిన్సీ — ప్రస్తుత వాతావరణం మాకుచాలు. నా సొంత తోటలో కొన్ని మార్పులు జేసి వ్యవసాయం చేస్తున్నాను. అది బాగానే ఫలిస్తూంది. ద్రాక్ష తోటలకి నేల గుల్లగా వుండాలి. గుల్లగా వున్నా సారవంతంగాకూడా వుండాలి. అందుకని ఎరువుతోపాటు గులకరాళ్ళు బాగా సమృద్ధిగా వేస్తున్నాను. దీనివల్ల ద్రాక్షతీగల వేళ్ళు నేలలో బాగా చొరబారుతాయి. నీళ్ళూ గాలీ బాగా పీల్చుకుంటాయి. ఫలితం మంచిపంట, మేలురకం పళ్ళూ!

ఫియా — సరి సరి! మళ్ళీ యింకో కొత్తవిషయాన్ని గురించిన వుపన్యాసమా!

రికార్డో — మీ రెన్నిచెప్పినా ద్రాక్షరసం తయారుచేయడమే ఒక ప్రత్యేక కళంటే నమ్మండి!

డావిన్సీ — లోకంలో తేలిగ్గా చేసే పనుల్లో ఒకటి ద్రాక్షరసం తయారుచేయడం! అయితే తయారుచేసేప్పుడు మాత్రం కొన్ని ముఖ్యమైన పనుల్లో తగిన శ్రద్ధ తీసుకోవడం చాలా అవసరం. ద్రాక్షరసం నిలవబెట్టే పాత్ర

లకి తప్పనిసరిగా మూతలుండి తీరాలి. ఏమాత్రం గాలి లోపలికి చొర బారగూడదు. గాలి లోపలికి వెళ్ళిందా సారమంతా పోయిందన్నమాటే! ఇక రెండో విషయం యేమంటారా అశ్రద్ధగా........

ల్యూక్రీ — లెనార్డో! ద్రాక్షరసగుణగ్రహణవేత్తవి కూడానా నువ్వు! నా ద్రాక్ష రసాన్ని చవిచూసి నువ్వు గుణం చెప్పాలి! (వెనక్కి తిరిగి) బాల్టాజార్! లెనార్డోగారికి "మాంచిరకం" ద్రాక్షరసం కొంచెం తీసుకురా. రుచిచూసి చెపుతారు. (టెస్సా వెళుతూ 'మాంచిరకం' అనేమాట వినబడి బాల్టాజార్‌కి సాంజ్ఞచేస్తుంది. బాల్టాజార్ వడ్డనబల్లవైపు ముఖం పెట్టుకున్నమూలంగా ల్యూక్రిజియా మాటలు వినపడవు.)

టెస్సా — (నెమ్మదిగా) వినబడ్డంలేదా? "మాంచిరకం" ద్రాక్షరసం కావాలంటు న్నారు బాల్టాజార్. నిన్నే విషం కలిపి యియ్యమంటున్నారు. (బాల్టా జార్ వులిక్కిపడతాడు. టెస్సా ట్రే కిందపెట్టి విషంవుంచిన ఫ్లాస్కు కింద పెడుతుంది. అది కాళీగా వుండడం చూసి లెనార్డో యిచ్చిన "ప్రేమరసం" విషమనుకుని డావిన్సీ గ్లాసులో కొంచెం పొంపుతుంది: ఈలోగా కింది సంభాషణ జరుగుతుంది.)

డావిన్సీ — మీరు వుత్తమమైనదాన్నిగా నిర్ణయించే గదా మీ బల్లదగ్గిరకి ద్రాక్ష రసాన్ని రప్పించారు. మీ విచక్షణాశక్తిని కాదనేటంత మూర్ఖుణ్ణి కాదు.

ల్యూక్రీ — మీ పొగడ్తలకేంగాని ముందు దీన్ని తాగి మీఅభిప్రాయం చెప్పక తప్పదు.

డావిన్సీ — వైద్యుడు ద్రాక్షరసంజోలికి వెళ్ళవద్దని మందలించి మరీచెప్పాడు.

ఫియా — వట్టిమాటల్తో గుణగణాల్ని యెలా నిర్ణయిస్తావు?

డావిన్సీ — క్షమించండి! నన్ను అర్థం చేసుకుని వదలివేస్తారనుకుంటున్నాను.

ల్యూక్రీ — నాకేమీ అర్థంకాదు. పైగా క్షమించడం నావల్లనయ్యేపనికాదు. ఇంత ముందు యిలాటి దెప్పుడూ చవిచూసి కూడా వుండవు.

(టెస్సా ద్రాక్షరసం తెచ్చి దగ్గిర పెడుతుంది. గ్లాసు పైకెత్తి చూసి మళ్ళీ వాసన చూస్తాడు.)

డావిన్సీ — మీ అభిరుచి కిదే నా ధన్యవాదాలు. చాలా మంచిరకం ద్రాక్షరసం. రంగూ, రంగుకు తగ్గా సువాసనా కూడా వుంది. పైగా మేలుకరం తోటల్లో తయారుచేసినట్లు కనబడుతుంది.

(తాగకుండానే గ్లాసు కింద పెడతాడు. ఈలోగా బాల్టాజార్ తేరుకుంటాడు. టెస్సా వంచిన ఫ్లాస్కులోంచే 'ప్రేమరసాన్ని' అందరిగ్లాసుల్లోను వంచుతాడు బాల్టాజార్.)

ఫియా — కొంచెం కూడా రుచిచూడకుండానే బల్లమీద పెట్టేశావేం లెనార్డో!
సీజరు — రుచైనా చూడకుండా రుచిగా వుందని యెలా నిర్ణయించావు?
లూక్రీ — మనస్ఫూర్తిగా పరీక్షించి, తాగి చూసి చెప్పాలి. తప్పదు లెనార్డో!
(విధిలేక భయపడుతూ, భయపడుతూ కొంచెం రుచిచూస్తాడు. లూక్రీజియా, సీజరూ ముఖముఖాలు చూసుకుంటారు. వికటంగా లెనార్డోవంక చూస్తారు. తాగి తాగడంతోనే 'ప్రేమరసం' లెనార్డోమీద పనిచేస్తుంది. ఇక ఆగకుండా గుటగుటా మిగిలిన రసాన్ని తాగేస్తాడు. వెంటనే ఫియామెట్టా దగ్గిరిగా జరుగుతాడు.)
డావిన్సీ — (ప్రేమగా) ఎంత సౌందర్యవంతమైన గులాబి మొగ్గైనా, వికసించకుండా, పరిపక్వం కాకుండా మనసును రంజింపచేసే సువాసన వెదజల్లలేదు. నోరూరజేసే రసమయత్వం దానికి రానేరాదు.
లూక్రీ — (ఆశ్చర్యంగా) నేనెప్పుడూ యిలా అవుతుందనుకోలేదు!
సిజరు — ద్రాక్షరసాల గుణగ్రాహకత్వంలోంచి, గులాబీల సౌరభ గ్రాహ్యంలోకి పోయింది వుపన్యాసధోరణి!
డావిన్సీ — నీపేరు వుచ్చరించడానికే ధైర్యంలేదు ఫియామెట్టా ....... ఫియామెట్టా.......నీప్రౌఢ సౌందర్యం నన్ను పూర్తిగా ఆకర్షించి తన కైవశం చేసుకుంది. నువ్వు నిజంగా వికసించి శోభాయమానంగా సువాసనలు వెదజల్లే గులాబిపూవువే సుమా!
ఫియా — (వేళాకోళం చేస్తున్నాడనుకుని) లెనార్డోకి నటించడం కూడా బాగా చేతనవును!
డావిన్సీ — (నిలబడి) మొదటి చూపులోనే నీదాసుణ్ణయిపోయాను.
రికార్డో — పరవత్వంలోనూ గట్టివాడే.
యిన — యౌవ్వనంలో యెలావుండేవాడో!
ఫియా — నాకొత్త ప్రేయసి ఆరోగ్యంకోసం మీరందరూ ద్రాక్షరసాన్ని తాగక తప్పదు.
(బాల్టాజార్ తెచ్చిన గ్లాసులు అందరూ తీసుకుని తాగుతారు.)
డావిన్సీ — (ఫియామెట్టా మోకాలిపై కుడివైపుగా మోకరిల్లి) నా మొర కొద్దిగా విని మరీ నన్ను తృణీకరించు ప్రేయసీ! నేను నీకు తగినవాణ్ణి కాకపోవచ్చు. కాని నీమీద ప్రేమ నన్ను దహించివేస్తుంది. ఈబాధనిక భరించలేను.
ఫియా — (ప్రేమరసం ప్రభావం పనిచేస్తుంది.) ఎంత సుందరమైన క్షణమిది!

డావిన్సీ — నీలాల నింగికింద, నిర్మల సరోవరంలో, నీలికలువల్లా వికసించి నవనవలాడుతూన్న ఆనీలికనుల కీప్రపంచంలో యేది సరితూగుతుంది? మహాశిఖరోన్నతమైన నీ సౌందర్యాన్ని కళ్ళారా చూడడానికే ఈ పాంశు దేహుని కర్హత లేనప్పుడిక నీనిర్మలతనూ సౌందర్యాన్ని తాకి చూడ్డానికెక్కడ సాహసం వుంది? నీమీది తీయని తలపులతో నా కుత్సాహం ద్విగుణీకృత మౌతుంది. నాచిత్రరేఖా రాణిగా చేసి నిన్నమరజీవిని జేస్తాను నాశిల్ప సుందరిగా నిన్ను ఆరాధిస్తాను. మహోన్నత సౌధాల్ని నిర్మించి నీకు కానుకగా అర్పిస్తాను. పర్వతనిర్ఝరులపై వారధులను కట్టి నీపాదాల ముందుంచుతాను. (ప్రేమరసం అందరిమీదా పనిచేస్తుంది. రికార్డో ల్యూక్రీజియామీద తన ప్రేమ వెళ్ళబోసుకుంటాడు. మరుక్షణంలోనే యిసబెల్లామీద మమత వెల్లడిచేస్తాడు సీజరు.)

రికార్డో — ల్యూక్రీజియా.............ల్యూక్రీజియా.............అని పిలిచే చనువు నా కనుగ్రహిస్తావా? నీమూర్తిపైన నాకళ్ళు వ్రాలి మళ్ళీ తిరిగి రాలేదు. నేను నీపాదదాసుణ్ణి. నీకు సదా బానిసగా వుంటాను. సంతోషంగా! నీసుందర వీక్షణాలే నాకు వీడని అనుబంధపు సంకెళ్ళు!

ల్యూక్రీ — (లేచి నిలబడి ఎదంవైపు వెళుతుంది. గుండెలమీద చేతులు వేసుకుని) రికార్డో! ఎవరూ రగుల్కొల్పని ప్రేమాగ్ని నాహృదయంలో నువ్వు రగుల్కొల్పావు!

రికార్డో — (మోకరిల్లి) అంతస్సుల్లో తేడావున్న నిన్ను ప్రేమించి ఎంతబాధ పడ్డానో నీకెలా చెప్పను? నీ కీ విషయం చెప్పే సాహసం కూడా లేక పోయిందినాకు. "భగవంతుడా! ల్యూక్రీజియా కింత అందం ఎందుకిచ్చి నన్ను బాధపెడుతున్నావు? అందని మానుపండుకు ఆశించే దౌర్భాగ్యం నా కెందుకు కలగజేశావు? లోకంలో ఎందరో అందమైన స్త్రీలున్నారే! ఈవిడ్నే నే నెందుకు ప్రేమించాలి? అనుక్షణం నాహృదయంలో మెదులుతూ, తన సౌందర్యంతో నన్ను కాల్చేస్తున్న ఈమూర్తి నుంచి నే నెలా తప్పించుకోగలను?" అని దైవంతో మొరపెట్టుకున్నాను. ల్యూక్రీజియా! నావంటివాణ్ణి అనుగ్రహించలేవా? నీనిర్మలహృదయం నా ప్రేమ సంగీకరించలేదా? నీకోసం దహించుకుపోతున్న పిచ్చివైన నీకింకా జాలిలేదా?

సీజరు — (రికార్డో తర్వాత) యిసబెల్లా! చిరకాలంకింద టే నా హృదయం నీకర్పించాను. నువ్వు నాఆరాధ్య దేవతవి. నానోముల పంటవి. ప్రపం

చానికి చిరునవ్వుతో కనిపించాను. కాని హృదయంలో అహోరాత్రాలూ నీమీద ప్రేమనే అగ్నిజ్వాలను భరించాను. నువ్వు నాశక్తికీ, ప్రతిభకీ మూలానివి. నువ్వులేని నా జీవితం వృథా! దేవీ నువ్వు నాదానివి!

యిన — సీజర్.......నీప్రేమకి కృతజ్ఞురాల్ని!

సీజరు — (కుడిపక్కగా మోకరిల్లి) ఈప్రపంచంలో నువ్వు నాకోసం పుట్టావు. నీపాదస్పర్శవల్ల ఈభూమికూడా పవిత్రమైపోయింది. నీ వుండబట్టే ఈ ప్రపంచానికి నాసృష్టిలో నూతనసౌందర్యం వచ్చింది. నువ్వు పీల్చిన స్వేచ్ఛా వాయువులు, నువ్వు తాగి పిపాస తీర్చుకున్న నిర్మల జలాలూ స్వీకరించడానికి గాని, అనుభవించడానికి గానీ నేనసమర్థుణ్ణి! నిన్ను తాకలేను సరిగదా, నీవస్త్రాల అంచుల స్పర్శకూడా భరించే శక్తి నాకు లేదు దేవీ! స్వర్గానికీ, పాతాళానికీ, ఆకాశానికీ భూమికీ వున్నంత తారతమ్యం వుంది మనిద్దరి మధ్యా! నిన్ను ప్రేమించే సాహసం, నిన్ను పూజించే ధైర్యం నాకు ప్రసాదించ బడ్డాయి. నీచల్లని చూపుకోసం నాసర్వస్వం ధారపోస్తాను.......నీచిరునవ్వుల వెన్నెలకోసం....... సర్వ ప్రపంచాన్నీ వదలి పెడతాను..........

[ఇలా తెరపడే వరకూ అందరూ మాట్లాడుతూనే వుంటారు. బాల్టాజార్ కూడా వడ్డనబల్ల దగ్గిరికి వచ్చి కొంచెం "ప్రేమరసం' పోసుకుని తాగుతాడు. పెస్సా కూడా అక్కడికి వస్తుంది. దాని వెంట పరుగెత్తుతాడు. బల్లచుట్టూ తిరుగుతూ దాగుడుమూత లాడుతారు. పక్కనున్న వారిని కూడా గమనించరు. కవ్వించి నవ్వించి చివరికి పెస్సాని పట్టుకుంటాడు. దాన్ని కౌగిల్లోకి తీసుకునేప్పుడు తెరపడిపోతుంది.)

## గమనించవలసిన విషయాలు

[కుక్కపిల్ల ఏదైనా పనికివస్తుంది. మొదటిసారి మంచిరొట్టె గాని, మాంసంముక్కగాని ఫిదూ మెట్టా కుక్కకి వేయవచ్చు. రెండవసారిమాత్రం ములక్కాడపైన వాసనకి నీచు రాసి వేస్తే అది వాసన చూసి తినకుండానే వదిలేస్తుంది కుక్క. దీనివల్ల అది విషం వుందని గ్రహించి వదిలివేసినట్టు ప్రేక్షకులకు కనబడుతుంది. పూర్వం యిటలీలో ఫోర్కులూ, కత్తులూ వాడినా ప్రతి సారివడ్డనకూ మార్చినట్టులేదు. అందుకని ప్రతీసారీ పళ్ళాలు మార్చినప్పుడూ కత్తీ, ఫోర్కూ మార్చనక్కరలేదు. పెస్సా పళ్ళాలు త్వరత్వరగా మార్చడం ముందేబాగా ప్రాక్టీసు చేసుకోవలసి వుంటుంది. లేకపోతే కాలం చాలా వృథా అవుతుంది.]

సమాప్తం: